శ్రీ

# త్రిపుర విజయము.

[ఐదంకముల నాటకము.]

కవితాకోవిద,

అల్లంసెట్టి అప్పయ్య.




కార్త్రికే ముద్రాలయము,
విజయనగరము.

1940



[వెల: 8 అణాలు.

ఈనాటకమును ప్రదర్శించువారు నాటకసామానులందును సంబంధించిన కొన్నిసూచనలు నావలనఁ బడయందగును. సర్వస్వామ్యములు నాయధీనములు.

ఇట్లు,

గ్రంథకర్త.

ఓమ్.

నమశ్శివాయ.

# పండితాభిప్రాయములు.

---

శ్రీ కవితాకోవిద, అల్లంసెట్టి అప్పయ్యకవిగారాంధ్రలోకమునకుఁ జిర పరిచితులు. వారి కవితాఖాద్యములు తఱచు ప్రతిపత్రికాపుటమునందును లభ్య మగుచునేయుండును. ఆయన లేఖిని చిత్రించిన యీనాటకము 'త్రిపురవిజ యము' వాఙ్మయజీవులకు ప్రేమాస్పదము కాకపోదు.

'కావ్యేషు నాటకం రమ్యమ్' అనియు 'నాటకాంతం హి సాహిత్యమ్' అనియుఁ బ్రాజ్ఞులమతము. అట్టి సంప్రదాయముల ననుసరించియే వీరు కావ్యకళ యం దసమాన ప్రౌఢిమసంపాదించి నాటకరచనకు దిగుటచే నీప్రయత్నము జయ శీలమైనది.

సాంఘిక నాటకములకే విశేషాదరముగల యీదినములలోఁ బురాణకథ తీసు కొన్నను వారి రచనావిధానాతిశయము కథకు మనోహరత్వము నాపాదించు చున్నది. రచనాపద్ధతిని జాలవఱకు వీరు పూర్వసంస్కృత నాటకమార్గము నవలం బించుటచే గ్రంథమునకు విశ్వజనీనత యేర్పడినది

'నాట్యంశీలే ప్రతిష్ఠితం' అనుపంక్తిని వీరు బాగుగ నవగతము చేసికొని యుందురు. లేకున్న త్రిపురుల పాత్రచిత్రణమున సంతటిస్వభావరమ్యతయేర్పడదు. గ్రంథమందంతటను వీరరసము వెల్లివిరియుచున్నది, భావములు సన్నివేశాను కూలములై సర్వాంగకోరములై యున్నవి. ఈకళాకుశలుని లేఖినివలన నాంధ్ర వాఙ్మయ మత్యంతము వర్ధిల్లుఁగాక.

విజయనగరము, 30—10—40. (Sd) విశ్వనాథ కవిరాజు.

---

కవితాకోవిద శ్రీ అల్లంసెట్టి అప్పయ్యకవిగారు నాకుఁ జిరపరిచితులు. వారు రచించిన యితరగ్రంథములుగూడ నేను చూచితిని. ఈ త్రిపురవిజయమును సాంతముగ జదివి యానందించితిని. కథావిషయము పౌరాణికమైనను బ్రస్తుత ప్రపంచపరిస్థితులు వీరినీరూపకమును వ్రాయఁబురికొల్పినట్లు నాకు రూపించినది. ధర్మగ్లాని కల్గినపుడెల్ల భగవత్ప్రభ యెట్లుదయించునది హృదయమునకు నాటునట్లు చిత్రించిరి. వీరు కళాకారులు. రెండుమూడు కళలలో బ్రవీణులు. వీరికవిత్వము మనోహరమై శ్రావ్యముగానున్నది. చాలపద్యములందు నుద్వేగము గొప్పగా మిమిడియున్నది. నేఁటి యాంధ్రనాటక సారస్వతమున నీ త్రిపురవిజయము ప్రశంసనీయము కాగలదని నానమ్మకము.

శ్రీకాకుళం. (Sd) ఇవటూరి సన్యాసిరాజు.

PRADHANISEKHARA
*B. Seshagiri Rao,* M. A. PH. D.
PROVOST, ANDHRA RESEARCH UNIVERSITY.

VIZIANAGRAM,
S INDIA.
28-10-40.

శ్రీ అల్లంశెట్టి అప్పయ్యగారు భారతీ తీర్థములో "కవితాకోవిద" బిరుదపట్టమును పొందియుండిరి. అప్పటినుంచి కవితారచనలు సాగిస్తూనేయున్నారు. ఇప్పుడీరూపకమును రచించి కృతకృత్యులైనారు.

త్రిపురదాహమను డిమము గీర్వాణభాషలో కలదని విందుముగాని ప్రచారములో లేదు. కాగా యీ తెలుగునాటకము స్వతంత్రరచనే. కథ వివిధ పురాణప్రసిద్ధము.

ఈ గ్రంథములో మాయామయునిపాత్ర చక్కగా పోషింపబడినది. పంచమాంకములో నారదమహేశ్వరుల సంభాషణ మిక్కిలి గంభీరముగాను, రమ్యముగాను వున్నది. పాత్రోచితసంభాషణ మిట్లుగదాయుండవలయును !

పద్యరచన చాలా ప్రౌఢముగాను, ధారగాను, వీరరస ద్యోతకముగాను వున్నది. ఈరచయిత సాహిత్యసేవ యెంతయు ప్రోత్సహింపదగియున్నది.

(Sd.) బుర్రా శేషగిరిరావు.

---

ఆర్యా తమరు దయతోనంపిన త్రిపురవిజయమను నాటకము నామూలాగ్రముగా జదివి యానందించితిని. ఆంగ్లగీర్వాణ భాషలయందు మీరు మిక్కిలి పరిశ్రమ మొనర్చినట్లు మీపుస్తకము తెల్పుచున్నది. 'నాటకాంతం కవిత్వమ్' అని మహాభాష్యకారుఁడగు పతంజలి వాక్రుచ్చినట్లు దశరూపక భోజరాజీయాది నాటకలక్షణగ్రంథములలోఁ జేర్కొనఁబడి చతుష్షష్ట్యంగములు-పంచసంధులు మొదలగువానితో సందర్భింపఁజేసి సలక్షణముగా నాటకమును రచించుట చిన్నపని కాదు.

ఈనాటకమునందలికథ పురాణాంతర్గతమైనది. ఇతివృత్తము ప్రఖ్యాతము. రసము వీరరసము. పాత్రాభినయ ప్రవిభాగము ఆయారసముల కనుగుణముగానున్నది. ఇతివృత్తము నాందీపద్యములో బాగుగా సూచింపఁబడినది. కవిత్వము సారళ్య నిర్దుష్టతా భూషితము. మీరింక నిట్టిగ్రంథములనేకములు రచించుటకు దగిన దేహారోగ్యాయుష్యములుగలిగి చిరకాల మీశ్వరకృపకు బాత్రులై వర్తింతురుగాక !

విజయనగరము,
28—10—40.

(Sd.) మేడేపల్లి వేంకటరమణాచార్యులు,
రిటైర్డు సీనియరు సంస్కృతపండితులు,
మహారాజా ఆంగ్లకళాశాల.

మహారాజశ్రీ అల్లంసెట్టి అప్పయ్యకవిగారికి:—

అయ్యా! మీ యంపిన భవత్కృత త్రిపురవిజయనాటకము స్థాలీపులాక న్యాయముగఁ దిలకించి కథాసంవిధానాదికమునకుఁ గడుంగడు సంతసించితి.

ఇంతకుము న్నర్వాచీనకవివరేణ్యు లెందఱో వారివారి బుద్ధిచాతుర్యము మెఱయఁ గవితావైదుష్యముం జూపి యెన్నియో రూపకములు సుప్రతిష్ఠలుగా రచియించియుండిరి. కాని, వానిలోఁ గొన్ని గ్రామ్యపదభూయిష్ఠములై నాటకలక్షణవిరుద్ధములై చ్యుతసంస్కారములై పరిహాసాస్పదములైయున్నవి. అట్లుకాక మీకృతి, సర్వవిషయముల సమాదరణీయమగుటఁ బండితపామరజనానందానుసంధాయకమై వన్నెగాంచఁగలదని దృఢముగాఁ జెప్పవచ్చును. మఱియు మీ కవిత, సహజమై రసోచితమృదుళమధురపదపూరితమై నాతికఠినమై యలంకారశోభితమై వ్యర్థపదరహితమై హృదయంగమమై ధారాశుద్ధిగలిగి ప్రసన్నతౌజోగుణప్రధానమై పవిత్రమగు నితివృత్తమునకు వన్నెపెట్టుచున్నది. ఇంతకు మీరు పాఠకలోకమునకుఁ గృతపరిచితులైయుండుట మిమ్ముఁగూర్చి నేనేమిప్రస్తావించినను స్తుతిపాఠమే యగుఁ గదా!

ఖండకావ్యయుగమగు నీకాలమునఁ దా మిట్టినాటకరాజంబు రచియించి పాఠకలోకమునకు మహోపకారము గావించుట కరము ప్రశంసార్హము. ఇట్టి మీ యుద్యమమునకు సహకారముఁ జూపుచుఁ బండితులును విద్యాశాఖాధికారులును మీకుఁ జేయూఁత నొసంగుదురుగాక! ఆశ్రితవత్సలుఁడగు సర్వమంగళాప్రియుఁడు మీయెడఁ బ్రసన్నుఁడై మీచే సదా భాషాసేవ చేయించుచు మీ కతోధికాయురైశ్వర్యాదికము ప్రసాదించి సంరక్షించుగాక! ఇట్లు,

సుధీవిధేయుఁడు,
శ్రీకాకుళ మ్యునిసిపల్ హైస్కూలాంధ్రోపాధ్యాయుఁడు,
(Sd) గరిమెళ్ల వేంకట రామమూర్తి.

---

మ. రా. రా. అల్లంసెట్టి అప్పయ్య కవిగారిచే రచింపబడిన త్రిపురవిజయమను నీ నాటకమును నేను చదివితిని. ఈచరిత్రమును నాటకరూపముగా వ్రాసినవారు వీరొక్కరే. శైలి మృదుమధురమైనది. ప్రకృతియందనుభవసిద్ధములగు జక్కనిభావము లిందు నిమిడియున్నవి పాత్రపోషణము. కథాసంవిధానౌచిత్యమును బెంపొందించుచున్నవి. హృదయరంజకమైన లోకోక్తులు, అలంకారములును బెక్కులుంగలవు. ఈనాటకము చదువరులకు-శ్రోతలకు-ప్రదర్శకులకు ననురాగము గలిగించునని నాయాశయము. వీరింక ననేక సరసకావ్య కుసుమ మాలికలతో నాంధ్రసరస్వతిని బూజించి కృతార్థులయ్యెదరు గాక!

వ్యాకరణశిరోమణి,
(Sd.) నిష్ఠల సుబ్బరాయశాస్త్రి,
ఎ. వి. యన్. కాలేజి సంస్కృతోపాధ్యాయులు.

విశాఖపట్టణము,
27—10—40.

I HAVE had a very interesting reading of "TRIPURA VIJAYAM" written by Sri. Kavitha Kovida Allamsetti Appayya garu. Taking the short accounts of the story furnished by the different famous Puranas for his groundwork the author had to supply the details largely drawing from his originality. Every situation is very cleverly managed and suspense is maintained throughout. He has zealously kept up all the poetic concections of the past and adopted pure grandhic style as the vehicle of expression adapting it to the different characters and different contexts. The important aspects of characterisation and character development seem to have received scrupulous attention of the author, the majesty and gallantry of Vidyunmali, and the versatility and genius of Mayamaya bearing unequivocal testimony to the fact. The conversations are elegant, thoughtful and appropriate throughout, while the verses teem with many wise sayings, the best of them being the author's own. The figures of speech are all well-set; especially simile is shown in its novel but natural colours. That the author is a very learned man welding both Sanskrit and Telugu with much facility and ease is seen in every verse. On the whole the drama affords an interesting reading and engaging staging and I believe that it will appeal to one and all.

LAKAVARAPUKOTA,
26-10-40

(Sd) P. Ramabrahmam.
B. A., B. Ed.

---

## తప్పొప్పులు.

| తప్పు. | ఒప్పు. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| మారులు | మారాళులు | చేసుకొను | చేసికొను |
| ఎందుజనెదు | ఎందు చనెదు | తీఁదు | తీఱదు |
| కకాపకలు | కకావికలు | నిమగ్నునిఁబలెను | నిమగ్నునిబలెను |
| తేనెటీగ | తేనెటీఁగ | మెట్టునకిదియా | మెట్టుకిదియా |
| బుద్ధిశాలురు | బుద్ధిశాలులు | దేవగురు! | దేవగురూ ! |

ఆయాయిస్థలములందుఁ బాఠకు లివి సవరించుకొందురుగాక!

# రెండు మాటలు.

త్రిపురాసురులఁగూర్చిన యితిహాసము పురాణాంతర ప్రసిద్ధమై చాల ప్రాచీనమైనదని తద్జ్ఞు లెఱుంగుదురు. సంస్కృతాంధ్ర గ్రంథకారు లెవ్వరును దీని నింతదనుక నేకారణముననో ప్రత్యేక కావ్యముగ రచింపనందునఁ జాలకాలముక్రిందట నేను దీనిని నాటకముగా రచించియు, నేఁటికి ముద్రాపిత మొనర్ప సాహసించితిని.

ఔదార్యవంతులును, పండితవరేణ్యులునగు శ్రీమత్కందాళ రంగాచార్యులు, M. A, B. L. గారు యిటీవల నీపుస్తకమును జదివి తమ శ్రీరామానుజాచార్య విద్యాసమితి మూలముగా దీనిని బ్రకాశింపఁ జేసినందులకు వారికి నా వందనములు.

ముద్రణావసరమున నా రచన కనుకూలించునవనుకొని సంస్కరించి గొన్ని మార్పులతోఁ గథాభాగమును విపుల మొనర్చితిని.

గ్రంథమంతయు సాంతముగఁ జదివి తమ యమూల్యాభిప్రాయములతో నన్నుఁ బ్రోత్సహించిన కవిపండితవర్యులకుఁ గృతజ్ఞుఁడనై నమస్కరించుచున్నాను.

ఈ సందర్భములో మఱియొకవిషయము వ్రాసి ముగింతును. ప్రూఫులన్నియుఁ జాల జాగ్రత్తగాఁ జూచి యోపికతో నాకుఁ దోడ్పడిన శ్రీయుత, పి. అప్పారావుగారికిని, నాయం దాదరభావముతోఁ ద్వరలో నిది ముద్రింపఁజేసిన కార్మికముద్రణాలయము కార్యవర్గమువారికిని నేను కృతజ్ఞుఁడను.

బాధ్యతాయుతముగ నీకార్యము నిర్వహింపఁబడినను దోషములుండకపోవు. ఇందువిషయమై నా ప్రయత్న మెంతవరకు నెఱవేరినదియుఁ బాఠకమహాశయులకే విడుచుచున్నాను.

చిత్తగింపుఁడు.

పొందూరు,
1—11—40.

అల్లంసెట్టి అప్పయ్య.

# ❖ పాత్రలు ❖



## —: పురుషులు :—

ఈశ్వరుఁడు }
బ్రహ్మ } త్రిమూర్తులు.
విష్ణువు }
ఇంద్రుఁడు
బృహస్పతి (సురగురువు)
నారదుఁడు
శుక్రుఁడు (అసురగురువు)
మయుఁడు (అసురశిల్పి)
మాయామయుఁడు (విష్ణుని యవతారము)
విద్యున్మాలి }
తారకాక్షుఁడు } త్రిపురాసురులు
కమలాక్షుఁడు }
వీరభద్రుఁడు
భృంగిరీటుఁడు
శిష్యుఁడు (శుక్రుని శిష్యుఁడు)
మాతలి (ఇంద్రుని సారథి)
కంచుకి
భటుఁడు

## —: స్త్రీలు :—

ఊర్వశి

---

ఖేలనా సమయమునఁ గొందరు దేవతలు, భటులు మున్నగువారు వత్తురు.

శ్రీ

# త్రిపుర విజయము.



## నాంది.

శ్రీలం గూర్చెడువాఁడు లోకతతికిం జిత్తంబు రంజిల్ల, దు
శ్శీలవ్యాపృతులైన దుష్టజనులన్ శిక్షించువాఁ డుగ్రతన్,
ప్రాలేయాచలబాలికాప్రియుఁడు నిర్వ్యాజప్రభావాఢ్యుఁ డా
నీలగ్రీవుఁడు శంభుఁ డెల్లసుఖముల్ నిత్యంబు మీకిచ్చుతన్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి సభ్యులపై
పుష్పాంజలిం జల్లి]

పూజ్యులైన యో పరిషజ్జనులారా !

గీ. కష్టములకోర్చి యెవ్వాని కరుణచేత
నెలమిఁ గృతకృత్యు లయ్యెద రింద్రముఖులు
నట్టి జగదంతరాత్మకు నాద్యునకును
సకల విబుధవినుతునకు నమస్కరింతు.

అహో! అదృష్టపూర్వకమగు నవీననాటకసందర్శనకుతూహలాయత్త చిత్తులగు నీ యుత్తమశ్లోకుల రంజిలఁజేయు భాగ్య మదృష్టరేఖ వలనఁ గదా! (తెరవంకఁ జూచి) మారిషా! నిన్నాజ్ఞాపించితిననుకొనకుము. దయయుంచి నీ పనులన్నియుఁ దోవసే చక్కఁబెట్టుకొని యిటొకతూరి రమ్ము.

పారిపార్శ్వకుఁడు:—(ప్రవేశించి) భావా ! ఇదేవచ్చితిని. ఆజ్ఞయేమి ?

సూత్ర:—ఆజ్ఞ కాదు. ప్రార్థనాపూర్వకమగు విజ్ఞప్తి.

పారి:—అట్లైన నంజలిఘటించి భక్తివిశ్వాసములు నెఱపుచున్నాను. దిక్ప్రదర్శనమాత్రమున నీ యభిలాష మెఱింగింపుము.

సూత్ర:—మార్షా! నీకుఁ దెలియనిదేమున్నది? మనయందవ్యాజానురాగమున నేఁడు విజయంచేసిన యీ సభాస్తారుల నారాధించుట మనధర్మము. కావున నేకఫలాపేక్షకులమగుమనము చూపఱ నభిముఖులనుగా నొనరించు నాటకప్రదర్శనమునం దన్యోన్యసహకారముగా మెలఁగఁదగును.

పారి:—ఆర్యా! అదినిజమే, కాదనువారెవరు ? ఏకఫలాసక్తిచేఁ బరస్పరవిరుద్ధభావము లుత్పన్నములగుచుండుట లోకసహజము. అయినను విశ్వమానవకల్యాణదాయకం బగు మహాకార్యమునందు స్వప్రయోజనపరత్వమునకుఁ దావు లభింపదు కావున, మీరనినట్లు సజ్జనారాధనకార్యమే లోకశరణ్యము. దానికి సహకారమొనర్చుటయు నుత్తమోత్తమమే. శరత్పూర్ణిమనాటి పండువెన్నెల కువలయామోదకరమై కాంతిమంతమగుచుండఁగా—

[నేపథ్యమున వీణాగానము వినఁబడుచుండును.]

(చెవియొగ్గి) అల్లదే మహతీస్వనమువలె వినఁబడుచున్నది.

సూత్ర:—(ఆకర్ణించి) అవునది నిజమే. పూజ్యుఁడగు నారదమహర్షి యాతఁడు. ఏదే నొక వీరరసప్రధానమగు రూపకప్రదర్శనమున కుపాంగముగ నీ గానము వినఁబడుచున్నదే.

పారి:—అట్లైనఁ ద్రిపురవిజయముఁ బ్రదర్శింపవలసి యుండునేమో యోజింపుము.

సూత్ర:—సమయజ్ఞుఁడా! త్రిపుర విజయమును గూర్చి చక్కఁగా ద్యోతకమొనర్చితివి. గుణగ్రహణప్రధానమనస్కులెల్లరు నీరూపకమును మన్నింతురని నమ్మవలయును. ఏమందువా ? తత్కృతికర్తయు,

తే. పిన్ననాఁటనుగోలె సభ్యున్నతమతి
నుత్తమగ్రంథములు వ్రాయుచుండువాఁడు
అమలగాంగేయగోత్రసుధాబ్ధిచంద్రుఁ
డప్పయాఖ్యుండు సజ్జనాహ్లాదవృత్తి.

పారి:—అవును. ఇంతమాత్రము తెల్పఁజాలును. ఏతత్కవితాకోవిదుని రచనలయందు మనోహరమగు నితివృత్తముగల యీ నాటకమెంతయు సహృదయహృదయాహ్లాదకరంబై వెలయుఁగదా!

సూత్ర:—మిత్రుఁడా! అటులైన నైపథ్యవిధానమంతయు సిద్ధమైనదియా?

పారి:—కాకయేమి? అవియన్నియు సిద్ధముగనున్నవి.

సూత్ర:—మంచిది. గజచర్మధారియై నృత్యమొనర్చుచున్న పరమేశ్వరు ననుసరించుచుం గాలిమబ్బుల నడుమ వెలసిన యీ మహనీయుఁడు త్వరపడి యిదే వచ్చుచున్నాఁడు. ఇంక మనము మన కార్యనిర్వహణమునం దప్రమత్తులమై యుండవలయును. రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

[ఇది ప్రస్తావన.]

———

శ్రీ

# త్రిపుర విజయము.



## ప్రథమాంకము.



[మాధవీలతానికేతనములో నారదుఁడు ప్రవేశించును]

ఆహా! సృష్టిసంపదస్థితి యెంతలో నెంతమార్పువచ్చెను. ఎన్నియో వత్సరములు తారకాసురుని దాడికి వెఱచి నిజసదనము విడిచి యడవులయందును పర్వతములయందును దాఁగికొనియుండఁగా జీవితమంతయుఁ గడుపుచువచ్చిన యీ మహేంద్రాదులకుఁ దమ యదృష్టవశమున నేఁటికో రాజ్యము దక్కి సుఖములభించినది. (యోజించి) మంచివిషయమే జ్ఞప్తికివచ్చినది. సరియే; శక్తిపరిహీనమున దుర్బలులై విపత్సముద్రమున మునిఁగియున్న తారకపుత్త్రుల నించుక దుఃఖోపశమన మొనర్పకున్న నావలన లోకమునకు, లోకమువలన నాకునుఁ బ్రయోజనము కల్గునెట్లు? కావున నేనిటే పోయి యవధీరితమగు రాక్షసలోకముఁ బ్రవేశింతును.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

[ఇది విష్కంభము.]



## ౩వ దృశ్యము.

(ప్రదేశము—సభామంటపము.)

[ప్రవేశము: శుక్రుఁడు-విద్యున్మాలి-తారకాక్షుఁడు-కమలాక్షుఁడు.]

విద్యు:—ఆచార్యా! నేనెట్లు వారింతును? ఎట్లువారించుకొందును? పితృవియోగశోకపరిపీడితులమై ధైర్యస్థైర్యములుఁ గోలుపోయిన మాకు సంతోషమనునది యెన్నటికైన లభించునా? కులగురువులు మేధావులునగు తామొకవంక నీతిబోధకమొనర్చుచుండ నాయీతమ్ములిరువురు మంత్రిసేనానాయకులునై విజయలక్ష్మీపరిగ్రహణంబునకై యన్వేషించుచుండ, మకుటధారినై నేను రాజ్యరమావిభవంబుల ననుభవించుటకంటె వేఱొండు సంతోషప్రదమగు విషయమెయ్యదియులేదుకాని, పితృవియోగ శోకాంకూరము మాత్రము మాహృదయక్షేత్రములందు మొలకలెత్తుచుండునుకదా!

శుక్ర:—అయ్యా! దీనికెవ్వరేమి సేయఁగలరు? ఇదిదైవికముగాజరిగినకార్యముగాని వేరుకాదు. ఎంతవిలపించినను మరణించినవారిని మరలఁగన్గొనఁజాలుదుమే? ఒక్కింత ధైర్యమూనవలెఁగాని మీకుఁదెలియనిదేమున్నది?

తార:—గురువర్యా, మా రాక్షసకులంబునకంతకు మకుటాయమానముగా నొప్పారుచు నెనలేని యోధాగ్రగణ్యుఁడై మిన్నుముట్టఁబేరువెలసిన మాతండ్రిగారి నొక్కనిమిషమాత్రమైన స్మరింపక మఱచుటెట్లు? (స్మృతినభినయించి) హా! జనకా! రాక్షసకులసార్వభౌమా!

సీ. నిజబాహుశక్తిచే నిఖిలవైరుల నాజి
నాలమందలయట్లు తోలితీవు

అళికాక్షునైనఁ గన్నరమోడ్పఁ గావించు
భటవాహినుల సిద్ధపఱచితీవు
పరమతపఃప్రభావమున నేకినైన
నందరానివరంబు లందితీవు
పురుహూతు తలఁదన్ను భోగంబులన్నియు
సంప్రీతితోఁ బొందఁజాలితీవు

తే. మమ్ము మువ్వురుపుత్త్రుల మనిపితీవు
ప్రబలతేజోనిధివటంచుఁ బఱఁగితీవు
కటకటా! కాలవశతను గడవలేక
యన్నిటిం బాసి చనినాఁడవయ్య నీవు.

అక్కటా! జనకా, ఎంతశౌర్యరాశివైననేమి? ఎంతబాహుబలసంపన్నుండవైననేమి? కాలగతిచే మృత్యుముఖంబునఁ బడవలసివచ్చెఁగదా! హా! తండ్రీ! రణరంగంబునఁ బ్రళయభైరవభీమాకారుండవై శత్రుసముదాయంబును నుగ్గునూచములుగాఁ జేసి గగ్గోలుపఱచెడు నీప్రతిభావిశేషము — నీపరాక్రమము లెందుఁ బోయినవి? తండ్రీ, నీవెన్నియేని యద్భుతకార్యము లొనర్పఁ బ్రయత్నించుచున్నట్లు నాతోఁ దెలుపుచు వచ్చుచుంటివే, ఆ యాలోచనములన్నియు భగ్నమయ్యెఁగా! నీకు మాయందుఁగల ప్రేమాతిశయము తుదముట్టెఁగా; అయ్యో, తీవ్రకోపావిష్టుండవై మహేంద్రునితోఁ బ్రతిఘటించి యాతని నెన్నిసారులు స్వర్గము నుండి సాగనంపలేదు? దిక్పాలకాదుల నీవెన్నియోమారులు పశుగణంబును బలెఁ బాఱఁదోలలేదు? ఆహా, ఇంతలో నింత విపరీతమా! ఇంతయపాయకరమా! ఇంతకాలగతి వైషమ్యమా! తండ్రీ, నీ తనయులమగు మమ్ముసయిత మా వీరస్వర్గమునకుఁ గొంపోవరాదా (ఆకసమువంకఁ బరికించి) ఛీఛీ, పాడుస్వర్గము జ్ఞప్తికివచ్చినది. ఔరా, మహేంద్రా, కుమారు నొకనిఁ బురస్కరించుకొని తారకుని సమయించి లబ్ధవిజయుఁడవైతినని మిట్టిపడకుము.

తే. విలయవేళాఘనార్భటీతులితఘోర
భయదశంఖమహాధ్వానపాట్యమాన
సమదశాత్రవనికరవక్షఃప్రదేశు
నెఱుఁగవో నను మూర్ఖ! యింకెందుజనెదు?(అని లేచును)

విద్యు:—(నివారించి)తమ్ముఁడా, ఆగుమాగుము. మహేంద్రునొక్కని నిర్జించిన నేమాయె. తక్కుంగల త్రివిష్టపనివాసుల నెల్లరఁగ కాపికలోనర్చి విజయలక్ష్మీపరిణయమహోత్సవము జరుపకున్నఁ బితృవధకోపసంజనిత మహోద్రేకంబు చల్లారు నే, సమయము వచ్చుదనుక శాంతింపుము.

చ. చలమును జేవయున్ విడక సాహస ముంచఁగదయ్య నెమ్మదిన్
శలభములట్లు తావకభుజాబలగర్వదశేషవహ్నిలోఁ
పలఁ బడి యెల్లశాత్రవులు భస్మమునొందుట నిక్కమయ్యెడిన్
దలఁపఁగ రాదుగా యిఁక పితాకును గూర్చు ససహ్యవేదనల్.

కను:—అన్నగారు, వారించెద రేల? దేవపక్షపాతమై యీనాకమ్మృతమంతయు దేవతలకర్పించి సిగ్గునఁ దలలువంచుకొని యేమియుంజేయఁజాలనికారణమున సహజవిరోధులగు నా దేవతలు "వలీముఖనారికేళన్యాయమున" నుపేక్షించినారము మనకెన్నియో నిడుములు గలిగించుటయెగాక మనకులం బంతరించుటకుఁ బ్రబల ప్రయత్నములు కొనసాగించుచునేయుండిరి. ఇట్టిసమయమందు మన ముపేక్షింతుమేని యింతకంటె నెగ్గిదమా?

తార:—అయ్యో! ఇంకను శాంతించెద రేల? పిఱికిపంద లగు దేవతలయెడ మనకుఁగల పరాజయముఁగూర్చి కనులారఁ జూచుచుండుపలికినపలుకులు హృదయభేదనములు. అన్యాయవర్తనులై కపటోపాయంబువన్ని మనకిట్టి యిక్కట్టుఁగలిగించిన యామరాత్ములపై నేఁడిదే విక్రమించి సమరప్రయత్నములుసలుపవలయును. దేవేంద్రుఁడైన నేమి? గీర్వేంద్రుఁడైన నేమి? దిక్పాలకులైన నేమి? గిక్పాలకులైననేమి? ధైర్యము సెడి, పరాక్రమముఁదొఱంగి, డీలుపడి

దెసలకరుదెంచినను,బట్టి వల్లార్వవలయును.సమరాంగణంబున ఘోర సంచలనముగావించి స్వేచ్ఛావిహారము సలుపవలయును. ఇంత కంటెఁ జేయునదియంతయుఁ జేసితీరవలయును.

ఉ. చండతరప్రతాపమున శాత్రవసైన్యము నుగ్గొనర్చి, వే
దండములన్ హయంబుల వధంబొనరించి జయంబుగాంచి, యా
ఖండలునైన లక్ష్యమును గైకొన కుద్ధతి రేగి, వేగ దో
శ్చండిమఁజూపుఁ గట్టి బలశాలుల నందఱఁ బిల్వఁబంపుఁడీ.

కమ:— అయ్యా! పలుపలుకులేల? ప్రస్తుతకార్యమునకై గడంగుఁడు. స్వశక్తి సామర్థ్యంబులు లేక, కుటిలప్రవర్తనుఁడై లబ్ధవిజయుఁడనైతినని కన్నుఁగానక దురావేశము నొందుట యామహేంద్రునకే; పుత్తెకుఁబుట్టినబుద్ధి పుడకలతోఁగాని పోఁజాలదు.

తే. తులువతనమున నొక్క నిత్తోడుజేసి
యెంతపనినైన సాధింతురు హీనమతులు
తేనెటీగగమిం బసికూననైన
ధూమపుంజంబుచేఁ బాఱఁదోలినట్లు.

భటు:— [ప్రవేశించి] జయము జయము. రాక్షసకుల సార్వభౌములకు జయము.

విద్యు:— (చూచి) ఏమి?

భటు:— దేవరవారల సందర్శింప నారదముని వచ్చి ద్వారముకడ నున్నారు.

విద్యు:— మంచిది. నీవు వేగమరిగి యాయనఁ బ్రవేశపెట్టుము.

భటు:— చిత్తము. (నిష్క్రమించును.)

[నారదుఁడు ప్రవేశించును.]

(అనుబంధము ౧)

నార:— ఓనిర్జరవైరులార! మీవిచారహేతువు నేనెఱుంగనిదికాదు. బుద్ధిశాలురును దీక్షాపరతంత్రులునగు మీకు శుభం బగుఁగాక!

అందఱు:—(లేచి) తపోధనులగు నారదమునీంద్రులకు స్వాగతము. (పీఠముంజూపి) దయచేసి కూర్చుండుఁడు.

నార:—మంచిది. (కూర్చుండును.)

విద్యు:—మునీంద్రా! యెక్కడినుండి మీరాక?

కవి:—(జనాంతికముగా) అమరపక్షపాతియగు నీతఁడు పలుమాఱు స్వర్గమునకే పోవుచుండును. ఇప్పుడచ్చటినుండియే కాఁబోలు నీరాక.

తార:—మునీంద్రా! అమరలోకమునుండియే మీరాక యనుఁడు.

నార:—అవును. నే నేలోకమునుండి వచ్చిననేమి? అందఱకు హితముఁగోరువాఁడనే కదా?

తార:—సంశయమేల? మునిపుంగవుల కంతకంటె నవశ్యకరణీయం బెయ్యది?

విద్యు:—స్వర్గలోకవార్తలు వినఁదలంచితిమి.

నార:—స్వర్గలోకమున వార్తలుండవచ్చును. విశేషములుండవచ్చును. అయిన వానితో నాకుఁ బ్రసక్తియేమున్నది? మీకవసరమగు నంశముఁగూర్చి ప్రశ్నించిన సమంజసము కదా?

విద్యు:—అవునది నిజమే; మునీంద్రా! తారకాసురవధానంతరము దేవతలింక మమ్మెన్నిభంగుల సాధింపయత్నించుచుండిరో నిజమానతిండు.

నార:—(తలయూఁచి) అదియు నొక యనుయోగవిశేషమే కదా! సరియే; ఆవిషయము నేనెఱింగినదే యైన నిజముపల్కువాఁడనే—

శుక్ర:—అటులయిన మీకా యితివృత్తము తెలియునన్నమాటయా—లేక—

నార:—ఓహో! కవిగారి ప్రశ్నకు సముత్తరమిచ్చు మేధావి యెవరు?

విద్యు:—మీరుగాక మఱెవరు? మునీంద్రా! ఊరించి యూరించెద రేల? మేము తమవలనఁ దెలిసికోఁదగినది యొక్క విషయముమాత్రమే కదా!

నార:—నాకుఁ దెలిసినంతవఱకు నొక్క విషయముఁ గూర్చియే యననేల? సమస్త విషయములఁగూర్చి ముచ్చటించుకొన వచ్చును; కాని, మీరు వేగిరపడుచున్న యంశముఁగూర్చి యంత గాఁదెలిసికొన నవసరమే లేదు; తారక మరణానంతరము స్వర్గలోక మున—ఒక్క స్వర్గలోకమునఁగాదు, ఏలోకముననను వింతలు, విపరీతములు, అసలు లేనే లేవు. ఆతనియనంతరమునం దొకటి మాత్రము లోకమున మిగిలిపోయినది; అది తనకీర్తి యనుకొనుఁడు, లేక—

శుక్ర:—అయ్యా! అపకీర్తి యనుఁడు.

నార:—అది మీరనినమాట, నేనెప్పుడు సంకుచిత భాషణములు వచింతునా?

శుక్ర:—ఓహో, కలహప్రియా! ఏమి నీ చమత్కారగర్భితవాక్యములు? రణాంగణంబునఁ బంచత్వమునొంద లోకాపవాద మెన్నఁటికిని గలుగఁబోవునే; యెచ్చటివార్తఁ దెచ్చిపెట్టితివయ్యా! శాంతవచనమ్ముల వీరినించుక యుపశమింపఁ జేయవేమి?

నార:—అయ్యా! అది మీయనికాని నాదికాదు. ఇంతకు నేననిన దొక్కమాటయు లేదుకదా!

తార:—అయ్యా, జనాపవాదమునకు సహించి యాత్మవంచనమున, శత్రువులయెదుటఁ దలలువంచుకొని యుండుటకంటె వీరస్వర్గమే శౌర్యవంతుల కుత్తమమార్గమని మీకుఁ దెలియదా? అందులకే మేమిప్పుడు—

కమ:—ఏమేమి? మనకపవాదమా! పటుతర భుజబల విక్రమ ధౌరేయులమగు మనకపవాదమా! అఁ! ఏమట్లనుచుంటిరి యింతటి లేఁతమాటయా? అపవాదదోషము శమించుఁగాక.

(మీఁదుఁజూచి కోపముతో)

మ. కనదుద్యద్గదలూని ఘోరతర సంగ్రామ ప్రదేశంబులం
దనుమానింపక యా నిలింపులకు గర్వాటోపముల్ మాన్పి, యిం
ద్రునిచేవం జవిఁజూచు ముష్కర మహాక్రోధారుణాగ్ని చ్ఛటల్
వినువీథిం బఱతెంచు వేళలు సమీపించెన్ నిరీక్షింపుఁడీ.

(నారదునితో) మునీంద్రా! నామాటయొకటిమాత్ర మాలింపుఁడు.

సీ. కపట కృత్యముఁ బన్ని కడకింతయును నోసంగ
కమృతమంతయుఁ దామె యపహరించి
యెన్నఁడైనను వృద్ధి నెనయుదుమని స్వర్గ
సౌఖ్యమంతయు వేడ్క సంగ్రహించి
అన్నదమ్ములమంచు నరయక తుచ్ఛులై
బహువిధంబుల మముఁ బొట్లువెట్టి
యధికబలులైన యాసుమారకు వేడి
మాతండ్రి నాజిలో మడియఁజేసి

తే. దేవతలు సంచరించి రుద్రిక్తమతులు
ముందురానున్న గతి నాత్మలందుఁ దలఁప
కర, యివియెల్లమాకు నిరంతరంబు
హృదయముఁ గలంచుచుండ నీకేది తెలుపు?

మునివర్యా! ఇంతయేల? వారుమాకొనర్చిన యపకారముఁ దలఁచుకొలఁది ఖేదముద్రేకమే; ఇందుల కుపాయాంతరమూహించి మమ్ము ధన్యతములుగా నొనర్పుఁడు. తాము పరోపకార పరాయణులనియు, నిష్పాక్షికులనియును, విశ్వసించుచుంటిమి. మీ యంతరాత్మకుఁ దోఁచినయుపాయంబు నేది సేయుఁడన్న నట్లే యాచరింతుము.

తార:—అయ్యా! నామాట యొకటిమాత్రము సావధానులై వినుఁడు. మా పరాక్రమమంతయు నొక్క తారకాసురునితో మాత్రమని తలంపవలదు. ఏమందురా?

శా. సక్రోధారుణితాక్షులై యనిమిషుల్ సంగ్రామరంగంబులో
శస్త్రిం గస్త్రిఁ బురస్కరించుకొనినన్ సాధింపనే మద్ఘనా
వక్రోగ్రాగ్రసి; నభీతమానసుఁడ నన్ వారింప నేఁడోపెదిన్,
శుక్రాచార్యుని శిష్యులెల్లరును సంస్తుత్యప్రతాపుల్ కదం!

శుక్ర:—మేలు మేలు. వత్సా! ఇటువంటి ప్రగల్భవాక్యములని యెవ్వరైన ననఁగలరే? నీవు వాక్శూరుఁడవే కావు; క్రియాశూరుఁడవును.

నార:—భార్గవా! నీయట్టివానివలన విద్యగఱచిన వీరి వైదుష్య మసహ్యసామాన్యముకదా! వీరికి నింకను గర్వోత్సాహములు బుట్టికొల్ప నూహించితిరా యుపాయాంతరము.

శుక్ర:—ఊహింపనేల? అది తపోబలసంపత్తిచే లభింపఁదగినది.

నార:—ఔను, శ్రీమహావిష్ణువుంగూర్చి తపం బొనర్చిన నిష్టార్థములు బడయఁగలుగుదురు కదా!

శుక్ర:—వలదు. అతఁడు వరప్రదానదక్షుఁడయ్యు నేదే నొకయుక్తిఁ గల్పించి ప్రత్యేకవ్యాఖ్యానమున నవి రద్దుచేయుటకవకాశములు కల్పించియుండును.

నార:—అట్లయిన శంకరునిఁగూర్చి;

శుక్ర:—వీరి పితృవధోద్యోగంబునకు శంకరకుమారుఁడగు కుమారుఁడే కారకుఁడగుట యెఱుంగుదువుకదా!

నార:—అట్లయిన బ్రహ్మదేవునిఁ బ్రార్థించిన?

శుక్ర:—(అవధారితముగా) అదిమంచిపని. అట్లనే నాకును బోధమగుచున్నది. ఆవిషయముఁగూర్చియే యుపదేశింపవలయు నీవును.

నార:—అట్లనే గావింతము. ఓదైత్యవర్యులారా! మీ ప్రతాపమంతయు నేనెఱుంగనిది లేదు. శౌర్యగాంభీర్యములయందును, బాహుబలపరాక్రమములందును మిమ్ముఁజెప్ప యుర్వులఁ

చెప్పవలయును. మీగురువుగారిని జ్ఞప్తికిఁదెచ్చుకొనకయే మీధైర్య స్థైర్యములు పెంపొందఁజాలుచున్నవి. సంతసమయ్యె మీసాహసమునకు,

ఉ. అమరవిరోధులార! గతమైన ప్రసక్తికిఁ జింతసేయఁగా
సమయునె మీకు సౌఖ్యలవ, మన్నివిధంబులమీకు మేలుగాఁ
గమలజుఁ గొల్వరాదొకొ, యఖండసుఖంబులు దత్కృపామతిన్
గ్రమమున మీకుఁగల్గు వృథకాదిది, నావచనంబు నమ్ముఁడీ.

సృష్టికి మూలకారణుఁడు పితామహుఁడు. ఆతని సేవింపుఁడు. అతఁడు కృపాస్వరూపుఁడు, భక్తపరాధీనుఁడు. మిమ్మనుగ్రహింపక మానఁడు.

కమ:—(సగర్వము) అయ్యా! మఱియేమైన నొనర్పుమనుఁడు. సహజశౌర్య గాంభీర్య సముపేతులగు యోధాగ్రగణ్యుల కీర్తివరదత్త ప్రభావము వాంఛనీయముగా? యాచనాదైన్యమున ననితరసులభవిక్రమంబులబ్ధమైనను, దానికంత ప్రాధాన్యము లభించునే? కావున కాకదంతపరీక్షవలె నిరర్థకమైన యాతపోవిభూతిని నేను—

అందఱు:—(వారెంతురు.)

నార:—కమలాక్షా! ఇవి పసిబాలుర పలుకులు. మూసినముత్తెములవలెఁ దండ్రిచాటున నింతకాలము బ్రతికితిరి. ఇప్పుడు ప్రపంచవైఖరి పూర్తిగా మాఱిపోయినది. అధికులైన శత్రువులకుఁ గాలిసంకెలలు వేయుటకై యాత్మబలము మాత్రము ప్రయోజనకారియగు నినుపగొలుసు. ఇది లభ్య[redacted]ముగుటకు భగవానుని ప్రసన్నతావీక్షణ ముపాసితవ్యమని పెద్దలు నుడువుదురు. మఱియు మీవారందఱుఁ దపోమహిమవలనఁ గదా వర్ణనాతీతమైన పరాక్రమముల గడించిరి. మీకు మొదటినుండియు దేవతలందఱు నాగర్భశత్రువులు. అందుమహేంద్రుఁడు తేనెపూసినకత్తి; గండకత్తెర; ఒకవేళఁ గన్నులుచేసుకొని మిమ్ముఁబరామర్శింపుటకై యాతఁడు

బులియుచుండును. అతిపరిచయ న్యాయమున నన్ను నిరాకరింపక త్వరపడుఁడు. పగఱసాధించుకొనుటకై యిది యంకురార్పణము.

శుక్ర:—అంకురార్పణమే కాదు; విజయచిహ్నము.

అందఱు:— (తలయూఁతురు.)

శుక్ర:—నారదునిమాటలు సమంజసముగ నున్నవి. మీరు నిశ్చలచిత్తులరై విధ్యుక్తముగఁ దపంబొనర్పుఁడు. మీయభిమతంబు లీడేఱును.

విద్యు:—ఋషిసత్తమా! క్షుద్బాధాపీడితున కమృతరసంబు వోలె శోకసంతప్తహృదయుల మమ్ముఁ దనియఁజేయనెంచి యపారప్రేమ నిట కరుదెంచిన మీకుఁ గృతజ్ఞులము. మఱియుఁ బితామహుని ప్రేమకాంతులకు మాహృదయములు వినమ్రములై భక్తి నెఱపుచున్నవి.

నార:—అట్లైన మీముగ్వుర సంపూర్ణాంగీకారముతో నీయుద్యమప్రారంభము.

అందఱు:—చిత్తము.

నార:—సరియే; పూజావిధానములు ?

విద్యు:—ఆనతీయవలయుఁ దమరు.

శుక్ర:—తండ్రిగారిని మెప్పింపఁ గుమారుఁడెఱిఁగిన ట్లన్యులకుఁ గష్టము. అందులకే మీసహాకారము.

నార:—అట్లే; వలయువిధానమును దెల్పెదను రండి ప్పుడే—.

అందఱు:—చిత్తము. (నిష్క్రమింతురు.)

[యవనిక పడును.]

---

## 3వ దృశ్యము.

(ప్రదేశము—తపోవనము)

[ప్రవేశము:—విద్యున్మాలి, తారకాక్ష, కమలాక్షులు తపంబొనర్చుచుందురు.]

బ్రహ్మ:—(సాక్షాత్కరించి) ఓ దానవవీరులారా! మహాకష్టంబులకోర్చి నన్నుఁగూర్చి ఘోరతపంబాచరించినందులకు నేనెంతయు సంతసిల్లితిని. మీతపోగ్నిజ్వాలలు మీఁదిలోకములను మంటగొలుపుచున్నవి. ఇంకమీతపంబులు చాలించి వలయువరంబులు వేడుకొనుఁడు.

1,2,3:—పితామహా! ధన్యోఽస్మి ధన్యోఽస్మి. భగవంతుఁడవగు నీవు మాయందుఁ గటాక్షించి ప్రసన్నుఁడవైనందులకు ధన్యవాదములు. (నమస్కరింతురు.)

బ్రహ్మ:—మీకు శుభంబగుఁగాక లెండు.

విద్యు:—కమలాసనా! శత్రుబాధలవలన మేము పలుసారులు నవయుచుండుట నీవెఱుంగవే; నిర్నిమిత్త కలహంబుల ననేకులు మమ్ముఁముట్టడించి వంచింప, నిస్సహాయులమై, నిర్విణ్ణులమై దుర్బలులమై, యనేకవిపత్తులకు లోనై, యింక మేము నిలువరింపఁజాలుటెట్లు? దేవా! యిప్పటికైన మాకు నిరంతరవిజయము గల్గునట్లనుగ్రహించి రక్షింపుము.

తార-కమ:—దేవా! అమరత్వముఁగూడ ప్రసాదింపఁ బ్రార్థించుచుంటిమి.

బ్రహ్మ:—ఓహో! అమరత్వమా! ఇదిమీకుఁ దగని కోరికి. నేనును దానినొసంగఁజాలనందులకుఁ జింతిల్లెదను. అమృతపానమొనర్పఁగాని యమరత్వము సిద్ధించుటెట్లు? అట్టియదృష్టము

దేవతలకు లభించి చాలకాలమైనది. అటుల మీకు లభింపనేరదు. వేఱొండువరంబుఁ గోరుకొనుఁడు.

విద్యు:—దేవా! అనితరభేద్యంబులును, చిత్రకళా పరిశోభితంబులును, స్వేచ్ఛాగమనంబులుగు పురంబులు మూఁడిఁటిని మాకొఱకు నిర్మింపఁజేయుము. అవి మాకు నివాసయోగ్యములై విలసిల్లుచుండున ట్లనుగ్రహింపుము.

బ్రహ్మ:—మేలు మేలు దైత్యోత్తములారా! మీ కోరిక చొప్పున నేఁడే మయుని కాజ్ఞాపించెదను. అతని మహిమాతిశయంబున మీయభీష్టములు నెఱవేఱును. ఒక్క సంగతిమాత్రము వినుఁడు. కామగమనంబులుగల పురత్రయంబులతో మీరు మువ్వురు నొక్కప్రదేశమునకే విహరించుకాలము మీకు వ్యతీపాతము.

విద్యు:—దేవా! అట్టిదుస్థితియుఁగూడ మా కెప్పుఁడు కల్గును?

బ్రహ్మ:—వినుఁడు; మీరు బ్రహ్మద్వేషులరై సకల సత్కర్మలఁ బరిత్యజించి దుస్స్వభావులరై లోకోపద్రవమునకుఁ గడంగినపుడు మీ సమస్తవిభవంబులు నశించిపోవుటయె గాక, మీరును గతాయువులయ్యెదరు. దైవభక్తితత్పరులై యన్యాయప్రవర్తనకు లోనుగాక మెలఁగితిరేని యమరత్వము లేకపోయిన నట్టిమహాఫలమును పొందెదరు. ఇది నా వరలాభము. (అంతర్హితుఁడగును)

1,2,3:—ధన్యోఽస్మి ధన్యోఽస్మి!

(అందఱు నిష్క్రమింతురు.)

[యవనిక పడును.]

ఇది ప్రథమాంకము.

---

# త్రిపురవిజయము.

## ప్రవేశకము.

[అప్పుడు పురోపకంఠమున నొకానొకభటుఁడు
ప్రవేశించుచున్నాఁడు.]

భటుఁడు:—పతాకములు, ప్రభలు, తోరణములు, మంగళవాద్యములు, స్వాగత సన్మానములు, నివియన్నియు నేమి? ఔరా! జనులందఱుఁ దమ పనులు మానుకొని యెంతగొప్పయుత్సవములు జరిగించుచున్నారు? కారణముఁ దెలిసికొందమన్న నూరి పొలిమేర నొక్కపిట్టయైనను లేదే! ఈమహా వైభవము లన్నియు మా తారక మహారాజుగారి తనయులకొఱకు జరిపింపకున్న మఱొకవిధముగ నెట్లు జరుగును? మంచిది, యివియన్నియు నా యదృష్టదినము లే; ఇన్నినాళ్లు నా నిపుణతకుఁ దగినపని దొఱకక, పట్టణములోని పిచ్చికుక్కవలెఁ జాలదూరము తిరిగి తిరిగి గింజులు తప్పించుకొని యిక్కడికిఁ జేరుకొంటిని. ఇప్పటి కేదైన మంచియుద్యోగము దొఱకునేమో తొందరగాఁ బోయి మా రాజకుమారుల నాశ్రియింతుఁ గాక!

[అని నిష్క్రమించుచున్నాఁడు.]

శ్రీ

# త్రిపుర విజయము.



## ద్వితీయాంకము.

### ౧ వ, దృశ్యము.

(ప్రదేశము—సభాభవనము.)

[ప్రవేశము:—విద్యున్మాలి, తారకాక్షుఁడు, కమలాక్షుఁడు.]

విద్యు:— (సహర్షముగా) తమ్ములారా! భువనమంగళ దాయకుఁడగు వాణీనాయకుఁడు సుప్రసన్నుఁడై మన యీప్సిత ద్రుమంబుల ఫలవంతములుగ నొనర్చినందుల కస్మత్పూజనీయుఁ డెంతయుఁ బూజనీయుఁడు. ఆతని వరప్రదానమహిమవలనఁగదా మన విషాదము లన్నియుఁ దొలఁగిపోయినవి;

తార:—సంశయమేమి? ఆతఁడు ప్రేమపూరితహృదయుఁడై మన ప్రార్థన మంగీకరించిన జగత్త్రాత;

కమ:—మన చిత్తవిక్షోభ మంతయుఁ దీరిపోయినది కదా యిప్పుడు, ఔరా! మన మెంత ధన్యులము! అగ్రజులారా! ఇంకను మనకంటె నధికులై చరింపఁ జాలుదురా దేవతలు? సర్వవిధముల వారితోఁ దుల్యులమగుటయె గాక, యజేయులమై సంచరింపఁజాలమా? (యోజించి) ఇంతకు మయుఁడు రాఁడయ్యెఁ గారణ మేమై యుండునో;

భటు:—(ప్రవేశించి) దేవా! పూజ్యుఁడగు మయుఁడు;—

1-2-3:— (చూచి) ఎక్కడ?

భటు:— దేవా! ఇదే ద్వారమునొద్ద,

1-2-3:—తత్క్షణ మరిగి తోడ్కొని రమ్ము.

భటు:—చిత్తము. (నిష్క్రమించును.)

[అప్పుడు మయుఁడు చక్రమును చేతఁబట్టుకొని ప్రవేశించును.]

మయు:—(ఆత్మగతము) అహా! తపఃప్రభావసంపన్నులై, త్రిలోకవిజయదీక్షాసక్తులై, పితామహుని యాదరాతిశయములకుఁ బాత్రులైన యీ యుదారచరిత్రుల సందర్శనము వాంఛనీయము కదా! పరమేష్ఠిం బొడఁగాంచిన వీరలు, నాయం దవ్యాజమైన విశ్వాసము జూపఁదగుదురు. (పరిక్రమించును.)

1-2 3:—(చూచి యెదురేగి) దేవా! ఈ మణిపీఠము నలంకరింపుఁడు, నేఁడు సుప్రభాతము కదా!

మయు:—మంచిది. (కూర్చుండును.)

విద్యు:—దేవా!

చ. కలిగెను సర్వసంపద లఖండమునుగా భవదాగమంబునన్
దొలఁగెను పాపజాలములు దూరమునన్ మిముఁగాంచినంత నో
యలఘుచరిత్ర! మేము చరితార్థులమైతిమి తావకీన ని
స్తులిత కృపారసంబునఁ బ్రసిద్ధులరాకఁ గొఱంతకల్గునే ?

తార:—మహాత్మా!

తే. అద్వితీయ స్వకీయ విద్యావిధాన
సలలితాశేషమహిమ ప్రశస్తకీర్తి
నెవ్వఁ డాదరణీయుఁడై యెసఁగుచుండె
నట్టి నీకు నమస్కార మాచరింతు (అంజలి ఘటించును)

కమ:—రోగపీడితుని దివ్యౌషధంబువోలె మ మ్మన్నివిధముల నతిశయింపఁజేసిన పరమపూజ్యునకు నీకు నమస్కారము.

మయు:—మేలు మేలు, దానవకులాగ్రేసరులారా!

చ. విపుల బలప్రతాప పటువీరవరేణ్యుఁడు మీదుతండ్రి, తా
నపహృత దేహుఁడయ్యెనని యాతనిపేరును బెంపునిల్ప,. మీ

యపయశముం దొలంగుటకున్నె పరమేష్ఠినిగొల్చి ధన్యులై
యిపుడు సుఖంబుఁగన్నమిము నెంతయుఁజూడఁగ వేడ్కయయ్యె
[డున్.

విద్యు:—(దీనత్వ మభినయించి) మహాత్మా! తామి ట్లాన తిచ్చుట ధర్మమా?

చ. జననము నందినాఁటిమి నిశాచర రాజకులంబునన్, విధా
తృని కరుణారసంబున నదేమువరంబులు సంగ్రహించి మా
మనముల సంతసిల్లితిమి, మాన్యులమైతిమి కాని, యక్కటా!
జనకుఁడె లేఁడటంచు మను విచారముమాత్రము తీర దెన్నఁడున్.

మయు:—అయ్యా, నిజము.

ఆ. ధనములేదటంచుఁ దనవా రధికులంచు
విద్య శూన్యమనుచు విపుల బాహు
శక్తి చాలదనుచు జగతి శరీరధా
రులు నిరంతరంబుఁ గలఁగుచుంద్రు.

కావున, నిట్టివిషాదముంగూర్చి పరితపించిరేఁ బ్రయోజనకారి కాదని మీ రెఱుంగరే? మీరు పితామహునిగూర్చి తపంబొనరించినందుల కతఁడు మీకోరిన పురత్రయనిర్మాణార్థమై నన్నాజ్ఞాపించెను.

1-2-3:—సంతోషము.

మయు:—అమ్మహాత్ముని యాజ్ఞాప్రకార ముత్కంఠచిత్తుఁడనై నేఁడే యటు లొనర్చి వచ్చితిని. అదిగో; చూడుఁడు (అని చక్రముఁ ద్రిప్పుచుండఁగాఁ బురత్రయము కానవగును)

1-2-3:—(విస్మయానందములతో) దేవా! ధన్యులము ధన్యులము.

విద్యు:—చరితార్థులమైతిమి. దేవా! అట్టి మహాఫలమునకుఁ దోడుగ నింకొకటియుఁ బ్రసాదించి మమ్ము మన్నింపుఁడు.

మయు:—(సవిస్మయముగా) ఇంక మీ కేమికావలయును?

కమ:—అమరత్వము గాక యింకేమున్నది?

మయు:—ఓహో! ఇది నాకశక్యము, మఱియే దేనిఁ గోరుకొనుఁడు.

తార:—మహానుభావులరగు తామును నిట్లుతప్పించుకొనఁ బాడియే?

మయు:—(యోజించి) మంచిది, నేనొక యుపాయాంతర మూహించితి; కాని, నామాట ననుసరింపవలయును మీరు,

1-2-3:—దేవా! అవహితులము, భవదాజ్ఞానువర్తులము.

మయు:—(రహస్యముగ) అమృతమయమైన బావియొకటి నిర్మించితి. అకాలమునఁ గాని, కాలముఁ దీరియైనఁ గాని, మరణించువారి నా యమృతకూపమున నొక్కసారి ముంచినఁ బునర్జీవితులగుచుందురు. అమరత్వసంసిద్ధి కింత చాలదా?

1-2-3:—ధన్యోఽస్మి ధన్యోఽస్మి.

విద్యు:—దేవా!

సీ. నేఁడుగా మాకీర్తి నిఖిలలోకములందు
వ్యాపింపఁగల్గె నవ్యాజకరుణ!
నేఁడుగా మాకులంబీసులేని వితాన
నతిశయింపంబాదె మహానుభావ!
నేఁడుగా మాదుఃఖనిచయంబులెల్లను
దూరంగతములయ్యె సురవినుత!
నేఁడుగా సంతోషసింధువునోల
లాడంగలిగె సువిద్యాప్రసిద్ధ!
తే. నేఁడుగా సకలామరనిచయమందు
ఘనతఁగన్న మా ప్రతిభకు గౌరవంబు!
ఇంతకంటెను భాగ్యమింకేమికలదు
నీకృతజ్ఞత మఱువఁగ నేరమయ్య!

మయు:—(సంతోషముతో) మంచిది. మీరింక నైతిక ధర్మమార్గములననుసరింపుఁడు. మహత్తరమగు తపోవైభవమున కిది

సేవనీయము. గురుజనాదేశ మనతిక్రమణీయమని యెఱుంగుదుగు కదా ! భార్గవుఁ డుత్తమోత్తమ ధర్మసంవేది. ఆయన యుపదేశములను నిరంతరము మన్నింపవలయును; కాదేని, యీవల మిమ్ముఁ జెఱుపయత్నించువారు వేనవేలు. తెలుపవలసిన దింతియేకదా మీకు—

1,2,3, చిత్తము, దేవరయానతి ననుసరించెదము.

మయు:—ఇదిగో దివ్యచక్రము; దీనిని మీపురమున నలంకరించుచున్నాను. ఎన్నఁడైనను సకలసత్కర్మలు విడిచి, దైవద్రోహులరై యథేచ్ఛగా మెలఁగి, లోకోపద్రవకారణములగు రణవ్యాపారము లొనర్తురేని దీని పరిభ్రమణము నిలిచిపోవును.

కమ:—ఓహో ! ఇది భవితవ్యమును నిర్ణయించెడు చిహ్నము కదా !

మయు:— అవును. (నిష్క్రమింతురు.)

[ యవనిక. ]

---

## ౨వ, దృశ్యము.

(ప్రదేశము—పురప్రాంతము )

[ ప్రవేశము:—భటుఁడు. ]

భటు:—(ఆత్మగతము) అబ్బబ్బా! యెంతకష్టము! రాత్రింబవళ్లనక—యెండవానలనక—సుఖదుఃఖము లనక—యెన్నినాళ్లు పాటుపడినను ప్రభువులకుఁ గనికరము కలుగకున్నది కదా ! మన స్నెఱిఁగి యెంతవర్తించినను వృథాప్రయాసమే యగుచున్నదికదా! (మీఁదుఁజూచి) ఇది మట్టమధ్యాహ్నము. ఈ ప్రచండపు టెండలోఁ గాళ్లుకాలుచుండ, నెత్తిపగులుచుండ, మా కమలాక్షమహారాజుగారు వచ్చుదనుక శుష్కకాష్ఠమువలె నిలువఁబడియుండవలెనఁట! ఇదియేమి యన్యాయము? యేమి నా గ్రహచారము? అప్రభువుగా

రింక నెప్పుడు విచ్చేయుదురు; ప్రయాణ మెక్కడికి సాగింతురు? (పరికించి) అదిగో, మా కమలాక్షమహారాజుగారు వచ్చుచున్నారే! ఓహో! యిప్పుడే యమరావతికిఁ బ్రయాణము కాఁబోలు!

[కమలాక్షుఁడు ప్రవేశించును.]

కమ:—

సీ. ద్యోమార్గచరుల నిస్తులభుజాసారంబు
నేఁ డోకించుక చవి చూడవలయు
వజ్రహస్తుని దుర్నివారప్రభావంబు
నణఁచి వేఁ బట్టి పల్లార్పవలయు
నెల్లతావులకును నేగి యుద్ధతి నెల్ల
చెనఁటి దబిసిమూకఁ జెండవలయు
నెం దసాధ్యము లేకయే నిరంకుశవృత్తి
నీ జగత్త్రితయంబు నేలవలయు

తే. వన్నె కెక్కు నిశాచరవర్గమెల్ల
మేలు మేలనఁ దగురీతి మెలఁగవలయు
నెడ గడియు లేక, లోకంబు లేచవలయు
నిచ్చవచ్చినగతిఁ జరియింపవలయు.

భటు:—(స్వగ)ఓహో! యింతలో నే యిట్టియాలోచనమా? దీనివలన నేమి మూడనున్నదో! సరేమైన నేమి, ప్రభుసమ్మతమే—

కమ:—(భటునితో) ఓయీ, తెలిసినదా; ఇప్పుడే త్వర పడుము. నీవు స్వర్గమునకుఁబోయి యందు నివసించు దేవవేశ్యల నెక్కడకుఁ బోనీయక కాచుకొనియుండుము. తప్పించుకొన నెంచి వారొనర్చెడు మాయలకు లోఁబడవలదు. మహేంద్రుని గర్వపు మిటమిటలు నేఁడు సంపూర్ణముగాఁ దేటపడనగును. దర్వీపాకరస న్యాయమున నాతనికా స్వర్గసౌఖ్యమంతయు నప్రయోజనమని బుద్ధి చెప్పవలయును. అమరావతినంతయు నలుచేత నాడింపవల

యును. భుజవిక్రమంబు గనపఱుపవలయును. దేవతలచిత్తములు వకావకలు కావలయును. నాఁడు మనకొనర్చిన యపకారములు మఱచిపోకుము.

భటు:—దేవా! అదియటులే; ఱాలు ఱువ్వినవారిని బూలఁ బూజించుటయా! ఉత్పాఁత లూపవలయుఁగాక!

(నిష్క్రమింతురు.)

---

## 3 వ, దృశ్యము.

(అమరావతీ బహిఃప్రదేశము.)

[ప్రవేశము:—ఊర్వశి—భటుఁడు.]

భటు:—(అడ్డముగ నిలువఁబడి) ఓసీ! ఊర్వశీ! బుద్ధి మఱలించుకొని నామాట వినుము; కాదేని మా రాజుగారి కారాగృహము వచ్చును. తెలిసినదా? గడకు వ్రేలాడఁగట్టిన పాముపోలువలె, జీవికలేని యామహేంద్రునిపై నాసవిడుమకొనుము. ఈ లోకమంతయు మా రాజుగారు వశపఱచుకొనకమునుపు వారికిఁ గైవసమైతివా నీ కందల మెక్కింతుము. ఏమి, మాటాడవు?

ఊర్వ:—(ఊరకుండును.)

భటు:—అదిగో! తలయెత్తి కన్నులార మా ప్రభువుగారిని జూచుకొనుము. మబ్బుగ్రమ్మినతోడనే నాట్యమాడుట నట్టువపిట్టకు సహజము కదా!

[కమలాక్షుఁడు ప్రవేశించును.]

భటు:—దేవా! ఊర్వశి—

కమ:—ఓహో! ఊర్వశియా, సంతోషము.

ఊర్వ:—(మాటకయే వెనుకకుఁ బోవనెంచును.)

భటు:—నీ పిల్లిశీలములు మా ప్రభువుగారెఱుఁగుదురులే; మొగము తిప్పఁగఁ ద్రిప్పి నీకోరికఁ దెల్పుకొనుము. నీళ్లు నమలి,

యవకాశమును బోఁగొట్టుకొనకుము. కన్నులఁ గప్పుకొను గొప్ప తనమంతయు నీదే;

కను:—(సమీపించి) వగలాడీ!

ఉ. ఒల్లనిరీతి మాటలుమొగ మొందిచరం బనియేమి, నన్ను నీ
వల్లభు, నెల్లవేల్పుల నవారణవిక్రమలీల గెల్చి నీ
యుల్లముఁ బల్లవింపఁ దగియుండువలంతిని బాసిపోయెదే
తెల్లముగాఁగ నీదగు మదిం గల కోర్కె యదేమొ తెల్పుమా?

మఱియు నో ప్రియురాలా! పలువలుకు లేల?

ఉ. నీమదికిం బ్రియం బెదియొ నే నొనగూర్పఁగలాఁడ నమ్ము మో
కోమలి! యింక నిన్నుఁ గనుఁగొన్నకొలంది మనోజుఁ డెంతయుం
దామస మూని నా యెడద తాల్మి వదల్చెడు, నీదురూపమున్
నామదిఁ బాయకుండె విడనాడను నిన్ను సరాళకుంతలా!

భటు:—వెఱ్ఱిదానా! యింత యాలస్య మొనరింతు వేల? నీ యభిప్రాయముఁ దెలియఁజేయరాదా? రూపము చేతను, పరాక్రమము చేతను, సర్వవిధముల నింపితమైన మా ప్రభువుగారిని విడిచి పనికిమాలిన యింద్రునికొఱక పేక్షించుచుంటివా? ప్రశస్తమైన ముద్దుఖర్జూరమునువిడిచి చింతపండు నాశింతువా యేమి? పలుక వేల? నోటికిఁ దాళము వేయఁబడెనా?

ఊర్వ:—(కమలాక్షునితో) అసురనాయకా! నాపై నింత వలవంత యేల? నే నింద్రునికొఱకైనదానను. నన్నుఁ దలంపకుము.

కను:—ఓసీ పిశాచి! నీవు వరకాంతవా? గడుసుదానా! నీ కైలాటము లిక్కడ సాగిరావు. కల్లమాటలకు—డక్కరి వేసములకు వెఱ్ఱియై తలయూఁచిన యింద్రుఁడ ననుకొంటివా?

ఊర్వ:—(స్వ.గ) హా! నే నెట్టి నిర్భాగ్యురాలను! నా దురదృష్టమున కేమని వగతును? కిరాతునికిఁ జిక్కిన హరిణివలె నే నీ గరాసులకుఁ బట్టుపడితి కదా! దైవమా! నన్ను రక్షింపరాదా! నా ప్రార్థన మంగీకరించువారు లేరా! అయ్యో—

కమ:—మనోహారిణీ! యేల విచారము? నీవువలచిన యా యింద్రునికంటె వేయిమడుంగులు మేలుబంతి నగు నన్ను నీ విశాల నేత్రములతో నొక్కసారి తిలకించి యానందింపుము. (అని సమీపించును.)

ఊర్వ:—(కోపముతో) తుచ్ఛుఁడా! దురాత్ముఁడా! నీ యసహ్యావచనములచే నన్నేల కలఁతఁబెట్టెదవు? కడతేఱిన నీవారి నెల్ల జ్ఞప్తిఁ దెచ్చుకొని యైన యమరావతిని వదలిపొమ్ము.

భటు:—ఛీ! దురాత్మురాలా! యేమికూసితివి? గోముఖ వ్యాఘ్రమా! ఉట్టిఁబెట్టిన గుమ్మడికాయవలెఁ బొంకముగానుండఁ జాలక యిట్టి గర్వపొంకములా? (కమలాక్షునితో) దేవా! సెలవైన దీనినాలుక తెగఁగోసి యీ ఖడ్గమునకుఁ గానుకగా నొసంగెదను. దేవర యెన్ని మాటలాడినను దాఁ బట్టినకుందేటికి మూఁడేకాళ్లను మోటువసరములతో మాటలాడుటొండె, మరలిపోవుటొండె—

కమ:—మరలిపోవుదము దీనిని బంధించినపిదప;

భటు:—దేవా! యిది యింకెందుఁ బోఁగలదు. వంటయింటి కుందేలు;

కమ:—సరియే, విడువుము దీనిని; ఇఁక రంభ నన్వేషించి యామీఁదట—

భటు:—అమరావతిఁ బరిక్రమింతము.

కమ:—(నిష్క్రమించుచున్నాఁడు.)

భటు:—(ఊర్వశితో) ప్రయాణికునకుఁ దోఁకచుక్కవలె మాకు దాపురించితివి. నీవలన మా ప్రయత్నమంతయు వమ్మయ్యెను గదా! పులినోటికండవలె నిప్పటికి బ్రతికితివి లే.

(నిష్క్రమింతురు.)

[యవనిక పడును.]

## ౪వ, దృశ్యము.



(ప్రదేశము—మహేంద్రుని యాస్థానము.)

[ప్రవేశము:—ఇంద్రుఁడు, బృహస్పతి.]

ఇంద్రు:—(విచారించుచు) గురువర్యా! మనమన్నివిధముల నీ యమరావతిని బహిష్కరించుకొని యరణ్యావాసులమై దినములు గడుపుచువచ్చిన, నింతదిగులు—నింతనిరోధము కలుగకుండును కదా!

ఉ. క్రూరతరప్రవర్తనుఁ డకుంఠితబాహాబలప్రతాపుఁ డా
తారకుఁ డీల్గెనంచును ముదంబున నుంటిమికాని, తత్సుతుల్
మేరకుమీఱి మువ్వురు నమేయతపోవ్రతనిష్ఠ నూఁది, యా
నీరజగర్భునిం గొల్చి నేఁడు చరింతురుకాదె క్రూరతన్.

బృహ:—మహేంద్రా! ఇందులకై విచారింపఁ బనిలేదు. పోలుంబోలము లెఱుంగక పితామహుఁ డొసంగిన వరలాభముల వలననే వా రుద్రేకించుచున్నారు. మదపుటేనుంగులవలె ననర్గళసంచారులై క్రొవ్విదమునఁ గన్నుఁగానకున్నారు.

ఉ. మేలును గీడునెంచక యె మిక్కిలి యుక్కున విఱ్ఱవీగు చా
డాలురయందు నైతము ఘనంబగు ప్రేముడి జూపి వారికిన్
మేలొనగూర్చిపెట్టె పరమేష్ఠి ననం బనిగాని, వారలం
బోలను నిందసేయు మదిఁ బూనఁగదే యొకయింత క్రౌర్యమున్.

[నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

(అనుబంధము—౨)

నార:—

చ. ఎతఁడు సమస్తలోకముల నేలుచునుండును గన్నపుత్రుల
ట్లెతఁడు యతీంద్రచిత్తముల కేనియు వశ్యుఁడుగాఁ డుదారుఁడై
యెతఁ డణువై మహత్తగుచు నీజగమంతయు నిండియుండుఁ దా
నతఁడు నిరామయుం డజుఁ డనంతుఁడు కాచుత! సాధుసంతతిన్.

(ఇంద్రునివైపు చూరమునఁ బరికించి) అహో!

తే. కొంచెముగ నుత్తమాంగమున్ వాంచికొనుచుఁ
జెక్కిటం జేయిఁజేర్చి విశేష మోజ
నా నిమగ్నునిఁబలెను దీనాననుఁ డగుచు
యింద్రుఁ డొప్పెడు నేర! యిదేమి కతమొ!

(సమీపించి) మహేంద్రా! మహేంద్రా! యేమయ్యా బృహస్పతి యెద్దియో తెల్పుచుండ నీ విట్లు దీనవదనుఁడవగుచున్నావు?

ఉ. కొండలఱెక్క లుక్కునను గూల్చిననాఁడును, వృత్రదానవున్
భండనభూమిలో నెదిరి బాహుబలోద్ధతిఁ ద్రుంచునాఁడు, ను
ద్దండ మదావలేపులగు దైత్యులఁ బెక్కుర నుగ్గుసేయునాఁ
డుండని కం దొకించుక యయో మొగమందున నీకుఁదోఁచెడున్.

మఱియు,

తే. అగ్ని చల్లపడంగలే, దబ్ధు లింక
లేదు, భువనముల్ కంపింపలేదు, సూర్య
చంద్రగమనావరోధముల్ జరుగలేదు
కటకటా! చింతయేల నిష్కారణముగ?

ఇంద్రు:—నారదా! లోకరహస్యము లెఱిఁగియు నీవిట్లు పరిహాసమునకుఁ గడంగుటయా?

నార:—మహేంద్రా! యేమిది పరిహాసమా? నిఖిలనిర్జరచమూ నాథుఁడవై-త్రైలోక్యనాయకుఁడవై-సప్తశతకోటిహస్తుఁడవై పూజ్యుఁడవగు నీకుఁ బరిహాసమా? ఆహా! కాలవైపరీత్యము; (బృహస్పతితో) దేవగురు! మహేంద్రుఁ డెన్నఁడాడని దీనాలాపములకుఁ గారణ మడుగవచ్చునుకదా!

బృహ:—కారణమున కేమున్నది? అది క్రొత్తగాఁ దెచ్చిపెట్టుకొనినది కాదు. చిరకాలమునుండియుఁ బిశాచమువలె ననుసరించినది.

నార:—(యోజించి) ఓహో! దుర్మార్గులగు రాక్షసులేమైన నీ యమరావతిని ముట్టడింప యత్నించుచున్నారా?

బృహ:—అదిమాత్రము తరువాయియున్నది.

నార:—(ఆశ్చర్యముగా) కొంపమునిఁగినది, ఎవరా దురాత్ములు? అయ్యో! త్రిపురదైత్యులు కారుకదా!

బృహ:—వారుగాక యింకెవరు?

నార:—సరిసరి, దీనికిఁ గారణము?

బృహ:—బ్రహ్మదత్తమగు వరప్రభావము వారినున్మత్తులఁ జేసినది.

నార:—ఆహా! యెట్టిదిదియా పరిణామము? సమస్తసౌఖ్యసంధాతనైన ధాతయనుగ్రహింప వారికేమికొదవ? సురరాజ్యరమా విభవంబులపై నేలవాంఛ వొడమవలయును? విశేషించి దారుణకృత్యముల కేల పాల్పడవలయును?

ఇంద్రు:—నారదా! ధూర్తులకుఁగల మహత్తర వైభవము లన్నియు లోకబాధాకరకృత్యముల నినుమడింపఁజేయు విషవాయువులని యెఱుఁగుదువుకదా!

నార:—నిజము నిజము; మహేంద్రా! ప్రపంచమున నిదియునొక వైఖరియే; ఇంకొకటియేమనఁ — దమవైభవములకుఁ దుల్యమగునవి యన్యులనుభవింప సహింపఁజాలకుండుట మనకు నిదర్శనమే; ఏమైననేమి? తమకు స్వయంకృతాపరాధము లెంతవారినైనఁ బీడింపక విడుచునా?

ఉ. కొంకొకనాఁడు దానవులకున్ నొకకొక్కెడ సమస్తసురాసుధం
గొంటయెగాక వారలను గూడఁగఁ జేయుట యెల్లభాగము లి
ట్లుంటకు నింతగించి యనకేరా! దితిపుత్రులు నీకు నన్యులే?
గొంటఁ దలంపఁగాఁ జనునె కేవల పాక్షికబుద్ధిఁ గౌశికా!

ఇంద్రు:—(సవిస్మయముగా) ఆహాహా! నారదా? యేమి నీనుడువులు. నాది పాక్షికబుద్ధియా? అమృతము నేను పంచిపెట్టితినా? అది యే కాలమునాఁటిముచ్చట? పంచి యిచ్చినవాఁడు శ్రీ మహావిష్ణుండైయుండ నేనుత్తరవాదినగుదునా? కలహాశనుఁడవుకదా! ఇకను బ్రతికిరియులోనర్ప నిటులే వారి నుద్బోధింపుము.

నార:—మహేంద్రా! సామ్రాజ్యతృష్ణ బలీయమకదా! హృదయసౌధమున శత్రువు నిరంతరము స్వేచ్ఛగా మెలఁగనిమ్మ.

[నేపథ్యమునఁ గలకలానంతరము]

ఊర్వ:—(ప్రవేశించి) హా! త్రిలోకాధినాథా! రక్షింపుము.

ఉ. ఎన్నఁడు తారకుం డిలిగె నెక్కడి పోరుల, నాఁటఁగోలె న
న్నన్న వచింప సౌఖ్యలవ మన్నను నేఁటికిఁ గల్గ, దింకమీఁఁ
దెన్నఁడు కల్గుఁ గానలకు నేగుటయో మఱి నేల డాగుటో
తిన్ననితోఁ ప్రవఁజూపి నెతఁ దీర్పఁగదే సదయాత్మకుండవై.

ఇంద్ర:—నీపరి దేవనముంకుఁగారణమేమికవలచి యించుక యూఱడుము.

అంద ఱు:—(విస్మయముగాఁ జూచుచుందురు.)

ఊర్వ:—పాకశాసనా! ఏమని విన్నవించుకొందును? పాడురక్కసులవలని బాధ లెంతకాలమునకుఁ దప్పకున్నవి. దైవవశమున నెట్టులో తప్పింపఁబడి నేఁడిక్కడికి రాఁగల్గితిఁగాని, లేకున్న నేదేని వైపరీత్యము జరిగియుండెడిది. దయామయా! మేమింక నీపట్టణమున నివసించుభాగ్యము లేకపోయె; ఇంతకాలమునుండియు మమ్మెన్ని బాధలనుండియో తొలఁగించి రక్షించితివికాని, తీవ్రరూపముఁదాల్చిన నేఁటి యలజడిఁజూడ గుండె చెఱువగుచున్నది. దేవా! మాం తెలుగడయు నాత్మనముఁడవు నీవుగాక యెవరు? ఏలోకము సమస్తసంపదల కాటపట్టనియుఁ, బూజనీయమనియుఁ సర్వసౌఖ్యదాయకమనియు బుధులువక్కాణింతురో, యట్టి యీ దేవలోకమున నివసించుట దుర్భరమగుచుండ గత్యంతరమేమి?

సీ. పార్వతీపతినైన బతిమాలి యీబాధ
భరియింపలేమంచుఁ బలుకవలదె
యల రమాపతిఁ జేరిమైన దీనతనూని
యాభయదానముఁగోరి యడుగవలదె

వాణీమనోహరుఁ బ్రార్థించి యసురుల
 పెంపుమాయింప యత్నింపవలదె
మువ్వురఁ గాకున్న మునివృత్తిఁ గైకొని
 యెలమిమై కానల కేగవలదె
తే. [illegible]! చావులేని, రోగంబులేని
 దిక్కుమాలిన గండముల్ దినదినంబుఁ
 [illegible] కుములఁగ నింకెంతకాల మిట్లు
 దేవురింపఁగవలయునో తెలుపుమయ్యా!

ఇంద్రుః—(బృహస్పతితో) ఆచార్యా! యేమి సేయఁదగును? కంధరాబద్ధమహాపాషాణములవలెఁ జిత్తవిభ్రమకారకములుకదా దైత్యబాధలు.

నారః— (సగర్వముగా) మహేంద్రా! యిపుడుకదా యుపాయాంతరమూహింప గురువుగారిని గోరుచుంటివి; ఆ త్రిపురదైత్యుల తపోభంగమునకై యానాఁడు ప్రయత్నింపదగియుండెడిదికదా!

ఇంద్రుః— ప్రయత్నింపక యేమి? వారి తపోభంగమునకు మన్మథవసంతులఁ బంపితిమి కాని, జాడ తెలియకపోయెను.

నారః— పాపము! ప్రయాసములపాలైతిరి. ఇంతకు శత్రువులు బలవంతులుకదా!

ఇంద్రుః- విశేషించి మూర్ఖులు. బలవద్విరోధమునకు వెనుదీయరు

నారః— అగుఁగాక! కింకర్తవ్యతావిమూఢుఁడవై యిట్లింత కాలమూఁగులాడుదువు?

ఊర్వః— ఆర్యా, మహేంద్రా! యేదియెట్లున్న నమర వేశ్యాగణ రక్షణము మీధర్మము.

చ. సతతము నీదుపాదవనజాతములన్ మదిఁ గొల్తుమేని, యం
 చితగతి నృత్తగీతములచే భవదాత్మకు నింపునింపుచున్
 హితమొనగూర్తుమేని, మము నీయమరాలయకాంతలన్ దయా
 మతిఁ దిలకించి కాచెదవు, మానెద వన్య మొకింతమైనచోన్.

[నిష్క్రమించును.]

ఇంద్రు:—(విచారించి) ఆహా! హృదయభేదనదక్షములగు కఠోరవాక్యములు వినవలసివచ్చెనా మహేంద్రునకు—

తే. స్వచ్ఛజలపూర్ణమై యొప్పు సరసియందు
ఘనశిలాఖండములు వైచి కలఁచినట్లు
సదమలంబయి వెలయు నా హృదయమునకు
నధికతరమైన దుర్వ్యథ లలముకొనియె.

బృహ:—నారదా! స్థితియంతయుఁ జూచితివికదా!

నార:—చూచితిని—వింటిని—

బృహ:—ఇంక నారాయణుని దర్శింపవలయుఁగదా!

నార:—అవశ్యము. సంసిద్ధుఁడు నారదుఁడు.

[అందఱు నిష్క్రమింతురు]

[యవనిక]

---

౧౧వ, దృశ్యము.

(ప్రదేశము—క్షీరసాగరము.)

[ప్రవేశము:—ఇంద్రుఁడు, బృహస్పతి, నారదుఁడు.]

నార:—(దూరముంజూచి) మహేంద్రా! అల్లదే చూడుము! పొంగిపొరలెడు ప్రేమవాహిని; యమృతసేవధి; స్త్రీపుంవిలక్షణంబులు పొడసూపని సనాతనమగు పరతత్త్వము

తే. పిన్నపెద్దలభావముల్ పెంచుకొనక
జాతి నామాశ్రమంబులు సరకుగొనక
పరమధర్మనిరూఢులై ప్రాజ్ఞులైన
పుణ్యమూర్తుల కియ్యది పుట్టినిల్లు.

ఇంద్రు:—అహో! జగదేకపూజ్యుఁడగు మహానుభావుఁడు, ధన్యము ధన్యము,

చ. అనుపమితప్రభావులు మహాత్మకు లెవ్వరి పాదపద్మముల్
గనుఁగొన నెంచి సౌఖ్యములు గైకొన కర్థి జపింతు, రట్టి యా
య్యనఘు, జగన్నివాసు, దయాకరు, సర్వశరణ్యు, శ్రీహరిం
గనుఁగొననయ్యె నేఁడు మనకన్నులు పండువుగాఁగ నియ్యెడన్.

బృహ:—ఔఁవును. ప్రకృష్టమగు పుణ్యవశపాకమున లభ్యమగు నీతనిసందర్శనము ప్రార్థనీయము (పరికించి)

ఆ. ప్రాణిసంచయంబు పాపకలితనికి
మేటిపుడమియెల్ల నాటపలక;
కేళిసల్పు నెల్లవేళ లాటలతోఁ
గాలకడలియందుఁ బవ్వళించి.

అందఱు:—(సమీపించుచున్నారు)

ఇంద్ర:—దేవా! ఎవని మాహాత్మ్యము బ్రహ్మాదులకు నైతము దురూహమో, ఎవనిదయామృతసేవనము సమస్తవిబుధసంతోషదాయకమో; యట్టినీకు సదంబడిగ వందనములు.

బృహ:—దేవా! కరుణామయుఁడవు — లోకోత్తరమగు ననిర్వచనీయ మహాద్భుతశక్తిమంతుఁడవు. త్రికరణశుద్ధిగఁ దొల్లి మేమొనరించిన తపంబులు ఫలించుకతన భవదీయ దివ్యసుందరవిగ్రహంబుఁ గన్నులారఁ జూడఁగల్గితిమి. మాధుర్యవాదము లందుకొని మమ్ముఁ బ్రేమపాత్రులుగ నొనర్పుము.

నార:—దేవా! కృపాస్వరూపుఁడవు, అనన్యసామాన్యమహామహిమాన్వితుఁడవు. నిన్నుస్మరించుటకు మాటతోఁ బాటు మనస్సును జంకుచుండ నిశ్చయముగ మేము విమూఢులమైతిమి.

విష్ణు:—మీప్రార్థనల కేనెంతయు సంతసిల్లితిని. మీ రిటు లరుదేరఁ గారణమేదైన నుండనోపు;

ఇంద్ర:—దేవా! నీకుఁ దెలియని దేమున్నది?

క. మ్రుక్కఁడి రక్కసు లందఱుఁ
జక్కడఁగి రణము మిగుల సాతన మందన్

ముక్కోటికి సోకుడులు మ
మ్మక్కట! పలుపాట్లు వెట్టి రన్నివితములన్.

బృహ — దేవా! చెప్పసిగ్గగుచున్నది. అయినను రక్షిత వ్యులగు దేవతలయెడఁ గనికరించి సావధానుఁడవు కాఁగలవు.

తే. ఇంద్రునకుఁగల ప్రాభవం బింతలేను,
ఘన నిశాతశతారభీషణత లేను,
లేను స్వర్గాధిపత్యంబు లేదు సుఖము;
కటకటా! పురదైత్యుల కారణమున.

నార:— జనార్దనా! పురదైత్యుల యలజడి లోకవైపరీత్య మునకు మూలభూతముగ నున్నది. నిరుపమాన బలపరాక్రమము లతో నెంతు నజయ్యులై బలవద్విరోధములు పెంచుకొని తమ్ముఁ దామె మఱచియున్నారు.

విష్ణు:—అటులయిన వారి విపరీతచర్యలకుఁ గారణమేమి?

నార:—బ్రహ్మదత్తవరంబులే; దేవా! భవాదృశులెవ్వరుం గని దెద్దియు లేదు కాని, మఱియొక యసంగతముగుకృత్యము; మన్మ థునకు వసంతుండునుంబోలె నిందులకు మయుండును సహాయుఁడై యమృతమయమగు కూపముం గల్పించి, తన్మూలమున వారిప్రాణ రక్షణము గావించుచుండెను.

ఇంద్రు:—దేవా! ఆనాఁడు పరమేశ్వరుఁడు హాలాహల భక్షకుఁడై లోకోపద్రవ ముడిపెను. నేఁడంతకుఁ గోటిగుణితములు కదా దైత్యవిజృంభణములు!

విష్ణు:— మీ యావేదనల కేనెంతయు జాలినొందు చున్నాను. పేరిమార్ద్రములు కావించు మీ వినయవర్తనములు మీసచ్చరితాతిశయములను బుజువు చేయుచున్నవి. ధీరత వాటిం పుఁడు; ఇది విదోహపుల కాలము.

అందఱు:— దేవా! అటులైనమాకు మఱియుమేలే, ఏమిం

దురా; అహోరాత్రములు మేమెప్పటికే నరిగి యాచరింపవలసిన పరమధర్మము నీచరణసాన్నిధ్యమున నే—

విష్ణు:—ఇంత యవసరము లేదు (యోజించి) రాఁబోవు వైపరీత్యములు చక్కఁజూచితి. దానవోద్రేకము లచిరకాలములో రూపుమాయుటకై మాయామయుఁడ నగుచున్నాను. వివరింపఁదగి యుం దేనియు లేదు. ఊఱట జెంది మీరందఱు భవితవ్యము నాకాంక్షించుచుండుఁడు. ఇఁక వెడలఁదగును.

అందఱు:—భాగ్యము.

(అనుబంధము 3.)

[అందఱు నిష్క్రమింతురు.]

[యవనిక.]

ఇది ద్వితీయాంకము.

———

శ్రీ

# త్రిపుర విజయము.



## తృతీయాంకము.

### ౧వ. దృశ్యము.

(ప్రదేశము—పురప్రాంతము.)

[ప్రవేశము:—శుక్రునిశిష్యుఁడొకఁడు పుస్తకము చేతఁ బట్టుకొని]

శిష్యు:—సాయంకాలము కాకమునుపు గురువుగారొసంగిన పాఠమును వల్లించుకొని, యావల దేవాలయమునకుం జని, భగవానునారాధించి, యనంతరము సహాధ్యాయులఁగూడుకొని గురువుగారిని దర్శింపఁబోవలయును. నిన్నమొన్న జరిగిన యజ్ఞయాగాదులలో, సమారాధనలలోఁ బాల్గొని కృషియొనర్చినందునఁ బ్రతి పాఠముల నొక్కసారి చూడవలసియున్నది. (చూచి) ఓహో! అప్పుడే ప్రదోషవేళ యైనదే (పరికించి) అటులుగాదు, బహుకార్యాంతర ప్రసక్తుఁడనై వేళమఱచితిని, యిప్పుడింతకంటెఁ గాలాతిక్రమణమైనది.

తే. విద్యయు వివేకమును లేక వివిధగతులఁ
బొట్టపూటికై విలపించు మూర్ఖజనుని
యాశయముపోల్కి దిగ్వధు లధిగమించి
కటికిచీఁకటి మెలమెల్లఁ గ్రమ్ముకొనియె.

కావున, నిఁకఁ దడవు మసలక మాయుపాధ్యాయులనే దర్శింతును.

[అప్పుడు మాయామయుఁడు నెమిలిపింఛమును జేతఁబట్టుకొని ప్రవేశించుచున్నాఁడు.]

మాయా:—(శిష్యునింజూచి సమీపించి) ఓయీ! పాఠములనుచున్నావు. ఏమిపాఠములయ్యా, నీగురువెవరు?

శిష్యు:—(విస్మయముగా) అయ్యా! యేమైననేమి? నాతో మీకేమిప్రసక్తి? తోవఁబట్టి నడచిపోరాదా?

మాయా:—(వికటముగా) నడచియే పోవుచుంటినయ్యా, వాహనమిమ్మని తగవుఁబెట్టితినా యేమి? దానికేమికాని, నాప్రశ్నమునకు మాత్రము సదుత్తరమేల యీయఁగఁజాలవయ్యా? నీ యుపాధ్యాయుఁడేమంత సర్వజ్ఞుఁడా? నీవతనియొద్ద నభ్యసించిన దంత, గొప్పవిద్యయా?

శిష్యు:—ఓహో! మా యుపాధ్యాయుల సర్వజ్ఞత్వముఁ గూర్చి యపహసించుచుంటివా? బాగుబాగు నీవాచాలత!

మాయా:—సరియే; ఇంక నీవు పఠించు గ్రంథములఁగూర్చి పేర్కొనుము. ఒక్క యుదాహరణముతో నీపుస్తకములందలి పూర్వాపరవిరుద్ధవిషయములు గ్రహింపఁగలవు. (పుస్తకము తీసికొనును.)

శిష్యు:—ఇఁక నీ కుయుక్తులతో మాకేమిపని? పానకమునఁ బుడకవలెఁ బ్రవేశించి పుస్తకము నులిమివేయుచున్నావు.
(లాగికొనును.)

మాయా:—(రహస్యముగ) ఓయీ! మాయామయుఁడట: లోకములోఁ దనసిద్ధాంతములు వెల్లడింపఁదలఁచి యీప్రాంతమునం దతఁడు సంచారము చేయుచున్నాఁడఁట; యాతనివిషయమై నీకేమైనఁ దెలియునా?

శిష్యు:—తెలియదు.

మాయా:—వెఱ్ఱివాఁడా! ఇంత చదివితినంటివే, ఈమాత్రము తెలియకున్న నీహృదయమునం దేమి పరివర్తనముకల్గును? గంధపుఁ జెక్కలమోయు గార్దభమువలెఁ బుస్తకములు మోయుచుండుట

యేనా ? అందలి రహస్యార్థములన్నియు విప్పిబయటఁబెట్టి యుత్తేజకరమగు నీశక్తిచే వానినన్నింటిని నధఃకరింపవలదా ?

శిష్యు:—ఓహో ! యిదియంతయుఁ బరిహాసాస్పదమగు యుక్తివాదము. అయ్యా, నమస్కారము, దయయుంచి నాకు మాత్రము దారియాఁగుఁడు.

మాయా:—నామార్గముననే రమ్ము. మంచిదారి చూపుదును. పుస్తకములలో నేమికలదయ్యా, పోమరిపోతుల వ్రాఁతలు చూచి మురిసిపోయి యభివృద్ధినొందఁదగిన నీవుచెడి, లోకముఁ గూడఁ జెడఁగొట్టెదవఁటయ్యా?

శిష్యు:—(సరోషముగ) ఏమేమీ, శాస్త్రములను, శాస్త్రకారులగు మహర్షులను నిందించి ఘోరపాతకము నొడిగట్టుకొనుచుంటివా ? దీనికిఫలితముగ నరకప్రాప్తి తప్పదుసుమా !

మాయా:—(సతిరస్కారముగా) ఓహోహో ! పాపమొడిగట్టుకొనుటయఁట, నరకప్రాప్తియఁట! ఇట్టి గుడ్డిజోస్యమునెక్కడ నేర్చితివయ్యా! పుణ్యాపాపములు ! స్వర్గనరకములు ! కర్తవ్యాకర్తవ్యములు ! ఓహో ! తలయుఁదోఁకయునులేని మతములు లోకములో నెన్నియైనఁగల్పింపవచ్చును ఓయీ ! గబ్బిలమా ! నీమూఢవిశ్వాసములు చాలించి లోకమునుజూడుము.

శిష్యు:—పండితంమన్యుఁడా ! ఆంతర్యమెఱుఁగక మాటలాడుచుంటివి; శాస్త్రచోదిత ధర్మములను విశ్వసింపని నీవంటి యవినీతులకు మాప్రభువులు దండింతురు. తెలిసినదా ! నీ ప్రలాపములు చాలించి వెడలిపొమ్ము.

మాయా:—పెండ్లిపేరంటములునాని, బడుగవై, యుపవాసములఁ గృశించి ఱాలు రప్పలకు నీళ్ళుపోసికొని యేమేమో కలుగుచున్నదని నీవేపొమ్ము. అందేమియులేదని నిశ్చయమైనపుడే నీవు బాగుపడెదవు. నీ ప్రభువులు, మహారాజులఁట ! నన్ను దండింతురని గొణఁగితివే; నే నిదేపోయి వారినందఱిని లోఁబఱుచు

కొని నిన్నుకాదు—నీగురువును శాస్త్రవాదములో శృంగభంగ మొనర్చి పంపుదును. పాపము! విద్యార్థివి కావున నింక నీతోఁ బ్రసంగింపను. (నిష్క్రమించుచున్నాఁడు).

శిష్యు:—(విస్మయపరవశుఁడై) ఔరా! యీతఁ డెవ్వరో తెలియదు. ఉపన్యాసధోరణి పెడత్రోవఁ బట్టినది. ఇదియంతయు మాగురువుగారి కెఱింగింపఁబోయెదఁగాక!

(నిష్క్రమించును.)

---

## ౨వ, దృశ్యము.

(ప్రదేశము—పాషండాశ్రమము.)

[ప్రవేశము:—మాయామయుఁడు, నారదుఁడు, విద్యున్మాలి, తారకాక్షుఁడు.]

విద్యు:—(మాయామయుని జూచి నారదునితో)

తే. భవ్యకరపద్మముల బర్హిబర్హ మమరఁ
జూళికాహీనశీర్షంబు హోళిఁగూర్పఁ
గటినిబద్ధాంబరము రక్తకాంతులీన
నుజ్జ్వలప్రభ నిచటఁ గూర్చుండి రెవరొ?

అయ్యా! యీమహనీయుఁ డెవరు? ముఖవర్చస్సుఁ జూడ నద్భుతముఁ గొల్పుచుండెనే? ఇమ్మహాత్మునకు సువర్ణాంబరమునకు బదులుగ నీకాషాయవస్త్రమేమి? ఆ యుధంబున కుద్దిగ నెమిలిపింఛమేమి? ఆధిపత్యమునకుఁ బ్రతిగా నాశ్రమనివాసమేమి? ఆహా! నిజముగా నీతఁడు సన్న్యాసియైన, దండకమండలువు లుండవలయుఁ గదా! ఇట్టి యద్భుతవేషమున వీరిక్కడికేల రావలయును?

నార:—ఇతఁడే మాగురువర్యుఁడు. గంభీరమైన వీరియాకారము వీరి సచ్చరిత్రకు నిదర్శనము. స్వీయమతోద్ధారణకై యిమ్మ

హానీయుఁడు నిరంతరమును బ్రచారమొనర్చుచు నేఁడు మనయదృష్ట వశమున నిక్కడికరుదెంచెను. ఈతని యాశయమంతయు మీకు విశదపడును. దర్శింపరండు.

అందఱు:—(సమీపింతురు)

నార:—దేవా! ధన్యవాదములు. పూజ్యపాదుఁడవగు నిన్నుఁగూర్చి నిరంతరము స్మరించుచుందును. అపూర్వ పుణ్య పరిపాకమున భవత్సందర్శనము.

మాయా:—నారదా! సంతోషము. లోకములో మునిడి పండ్లవలెఁ గుప్పతిప్పలుగ నెందరేని శిష్యశిష్టవాచ్యులుందురు కాని, నీవొక్కఁడవే నాకుఁదగిన శిష్యుఁడవు. నీతోఁగూడ నరుదెంచిన వీరెవరు?

నార:—దేవా! త్రిపురదైత్యులు; దర్శింపవచ్చిరి. కృతార్థుల నొనర్పుఁడు.

మాయా:—(జనాంతికముగా) నారదా! పురదైత్యులు ముప్పురుకదా?

నార:—ఔను. వరలాభమునందిరపిదప నొక్కతావున ముప్పురును సమావేశముగాకపోవుట వీరికిఁ బరమప్రయోజనము.

మాయా:—ఓహో! తెలిసినది. వీరు మహాసంపత్ప్రసంపన్నులు. విశేషించి జగదేకవీరులు. స్థానము ద్యాయ నేర్పఱుపుము.

నార:—చిత్తము. (ఆసనములు చూపి) కూర్చుండుఁడు.

విద్యు-తార:—(కూర్చుండి) దేవా! నమస్కారము లందుకొనుఁడు.

మాయా:—దానవసార్వభౌములు-మీకుఁ గుశలముకదా!

నార:—దేవా! వీరికిఁగుశలముకాకయేమి? మహానుభావుఁడగు శుక్రుఁడు వీరికులగురువు. ఆతని యాశీర్వాదములు—

మాయా:—అవియే వీరిని జెఱుచుచున్నవి. (చెవులుమూసికొని) ఔరా! ఆశీర్వాదములు—అశనిపాతములు. నా మోహాచ్ఛా

రణమాత్రము చాలును. నాయంగములన్నియు వేధించుచున్నవి.

విద్యు:—(విభ్రాంతిగా) అయ్యా! విపరీతముగ నుడువుచున్నారేమి? వాస్తవముగ నాతఁడు మా భావి భాగ్యములు గోరుచుండుట లేదా?

మాయా:—(సాసూయముగ) ఔఁ, కోరుచున్నాఁడు, కుటిలహృదయుఁడు. దుష్కర్మఁడు. నిరంతరముఁ గోరుచునేయున్నాఁడుకదా కులక్షయమును.

తార:—ఆహా! ఆచార్యునకిట్టి కలుషహృదయమా! పూజ్యుఁడగు నాతని నిందింపకుఁడు.

విద్యు:— ఉత్తమోత్తమమగు ప్రజ్ఞావిశేష సంపన్నులు మా గురువర్యులు. మీ వాక్యములు సత్యదూరములు.

నార—:బాగు. గురుజనారాధన మనుల్లంఘనీయము.

మాయా:—దనుజవీరులారా! ఎంత వెఱ్ఱి! అమాయికులు కదా మీరు. చిరకాలమునుండి మీవంశకర్తల దుర్మరణములన్నియు నెట్లుజరిగినవి? అసంప్రదాయములు, పనాదృతములు నగు నాతని దురోధములవలననేకదా! ఔరా! వెదకి వెదకి యిట్టి కుటిల హృదయము నాశ్రయించుటయా? దైత్యసోదరులారా? అతఁడు మీ కుపదేశించినదంతయు వట్టిబూటకము. వేదములనియు - ధర్మశాస్త్రములనియు మీకేల యీకలవరింత. వేదమంతయు నసత్య వ్యాఘారణి వెలిబుచ్చినది. ఒకదానితోనొకటి సంబంధము లేకయుఁ బునరుక్తులతోడను నిబిడీకృతమై వ్యాఘాతగ్రస్తమైనది.

"సీ. కర్మంబు ఫలదాత గాదీశ్వరుం డంచు
ద్వివిధమై మీమాంస విఫలమయ్యె
నొక్కజీవుం డంచుఁ బెక్కుజీవు లటంచు
వేదాంతశాస్త్రంబు వితథమయ్యె
హరి యెక్కుఁ డంచును హరుఁ డెక్కుఁ డంచును
బహుపురాణంబులు పాటిదప్పె

నైకవిధ్యంబులే దరయఁగా స్మృతుల నే
తెఱఁగునఁ గీసినఁ దీయవచ్చు
తే. దానము లొసంగకుండునాతఁడె నరక
కూపములఁ ద్రోయుదురె మేలుఁ గోరి తనుకు
బుద్ధిహీనులు ప్రతిమలఁ బూజసేతు
రనఁగ నెందును వినరె ప్రాజ్ఞాగ్ర్యులార!"

నారః:—ఓహో! ఇట్టి విషమపరీక్షలోఁ గృతార్థులగుట యెవరికైనఁ గష్టతరముకదా. (ప్రకాశముగా) అమరవైరులారా! వినుచున్నారుకదా యీమహానుభావుని ప్రసంగము. మీయదృష్ట బీజము మొలకయెత్తినది.

విద్యు-తారః:— (తలయూఁచి) భాగ్యము.

నారః:—(మాయామయునితో) దేవా! వీరు పలువారులు గురుస్మరణమున వాపోవుచుందురు. సంశయవిచ్ఛేదమునకై వారి నిక్కడకు రప్పింపఁదగునుకదా!

మాయా:—(కోపముతో) ఛీ! అతఁడు దౌర్భాగ్యుఁడు, ద్రోహి—అనుష్ఠాన మొకటియు, నుపదేశ మింకొకటియు—అతనిఁ జూడఁ దిరస్కరించుచున్నాను.

విద్యు.—దేవా! క్షమింపుఁడు. సంశయవ్యగ్రహృదయులము. మాగురువర్యునిసమక్షమున మీయుభయవాదములందలి ప్రధానతను గుర్తింపఁదలఁచితిమి.

నారః:—(వినోదముగ) ఆశ్రితవాక్యములు మాననీయములు.

మాయా:—బాగు బాగు. మీకందఱకు నట్టికోరిక కలదేని యాహ్వానింపుఁడు.

విద్యు:—(పరికించి) ఎవరక్కడ?

భటు:—(ప్రవేశించి) ఆజ్ఞయేమి?

విద్యు:—ఆచార్యుని రప్పింపుము.

భటు:—చిత్తము. (నిష్క్రమించును.)

[అప్పుడు మఱియొక భటుఁడు ప్రవేశించుచున్నాఁడు].

భటు:—(ఆతురముతో) దేవా! ప్రమాదము-ప్రమాదము

విద్యు:—(చూచి) ఏమది ?

భటు:—ఒకానొక పాడియావు—

విద్యు:—ఁ, చెప్పుము;

భటు:—రాజమార్గమునఁబోయిపోయి—

తార:—ఏమ్మట ?

భటు:—నగరునందుఁ బ్రవేశించి—

విద్యు:—అనంతరము ?

భటు:—అమృతకాసారముఁజొరఁబడి—

తార-విద్యు:—అమృతము నేమి చేసెను ?

మాయా:—మీల్చివేసెనా ?

భటు:—(తలవంచుకొనును)

అంద:—ఆశ్చర్యమాశ్చర్యము.

తార. విద్యు:—అందఱుం జేరి దానిని బంధింపుఁడు.

భటు:—దేవా! ఆధేనువు మాయమైపోయినది.

విద్యు:-మహాత్మా! ఎన్నఁడు లేని మాకిట్టి యనర్థసూచనలకుఁ గారణ మెఱుంగుటకై మా హృదయము లాందోళించుచున్నవి. అమృతపానమొనరించి యీ ధేనువుఁగూడ యదృశ్యమగుటయా ?

నార:—ఇది సామాన్యమైనప్రశ్న—భూత వర్తమాన భవిష్యములఁగూర్చి యింకనెన్నియేని సముచితప్రశ్నంబుల కిది మంచి తరుణము.

మాయా:—మాయాచార్యు నడిగి తెలిసికొనుఁడు. అతఁడు కదా కులగురుఁడు మీకందఱకు;

విద్యు:—దేవా! ఎవరైననేమి యథార్థస్థితిని బ్రకటించుట యందందఱకు నధికారముకలదుకదా!

[అప్పుడు శిష్యుడు ప్రవేశించుచున్నాఁడు]

శిష్యు:—(ఆత్మగతము) ఔరా! ఎంత విపరీతమిది!

తుచ్ఛమై—హేయమై—పాపభూయిష్ఠమైన యీపాషండాశ్రమమునకా గురువర్యుని రప్పింపనుద్యోగించుట ; ఎంతఘోరము ? దైవద్రోహమున కొడిగట్టుకొనిన యిట్టి దుర్మతమును బ్రాజ్ఞులు స్వీకరింతురా ? మహర్షియఁట నారదుఁడు ! హౌరా ! కాలవికృతి, యెవరిచే నేమిచేయింప నుద్యమించునది తెలియదుకదా ! (ప్రకాశముగా) అయ్యా ! ఆచార్యుఁడిట్టి యభాజన ప్రదేశమునఁ గాలు మోపనుపేక్షమి నీవార్త తెలిపి నన్నుఁ బనిచిరి.

విద్యు:—(కోపముగా) తెలుపుము.

శిష్యు:— "వేదదూష్యమగు నిరీశ్వరమత ముపదేశించి మిమ్మధఃపతితులఁజేయవచ్చిన యీపాషండుని దణిమివేయుఁడు" అని—

నార:—బాగుబాగు, భార్గవుఁడా ! ప్రతిష్ఠించుకొనుచుంటివికదా యాత్మగౌరవము !

మాయా:—(పరిహాసముగా) నిసర్గకుత్సితుఁడు, మత్సరుఁడు, మీకు నేనేమి తెల్పితిని ?

తార:—(శిష్యునిఁజూచి) ఓహో, ఆచార్యుఁడు పిచ్చియై నిరాకరించెనుగా ? ఏమూతనుగర్వము ?

శిష్యు:—(తలవంచుకొని) గురుతిరస్కృతి సర్వధా నిందనీయము.

విద్యు:—(కోపముతో) నిందనీయము. ఛీ !

మాయా:—కసరుఁడు కసరుఁడు, ఇట్టి దేవానాంప్రియుల కందఱకు నిట్టిపాఠములే యిఁకమీఁద.

విద్యు-తార:—(శిష్యునితో) పొమ్ము.

మాయా:—పిట్టచిన్నది, కూఁత పెద్దదియునా ? నడువుము.

నార:—భద్రము భద్రము, ప్రమాదములు కలుగకుండుఁగాక !

అందఱు:—(నవ్వుదురు.)

శిష్యు:—(తిరస్కారముగా) ఓహో! పరమపవిత్రమైన మీయాశ్రమమున నింకఁగాలు పెట్టుభాగ్యము మముబోంట్లకు లేకపోయె; అట్టి యదృష్టము, మీరును మీమతము స్వీకరించిన మహానుభావులును సంపూర్ణముగ ననుభవింపుఁడు. (నిష్క్రమించును.)

మాయా:— (శిష్యునితో) ఇహీహీ! శాపవాక్కుల కిది కాలము కాదు. ఎక్కడకే నరిగి తలదాఁచుకొనుట యుచితము.

నార:—(విద్యున్మాలితో) మహామేధావులమాట లూరక పోవు. ఈ యుపదేశము మీ కనుసరణీయమైనదిగాఁ బొడకట్టుచున్నది.

విద్యు:—(మాయామయునితో) ఇదియంతయు మహాద్భుతమైన ప్రసంగము. అపూర్వపుణ్యపరిపాకముచే మీమాటలు విననయ్యెను. మహాత్మా! తాము సజ్జనులు-ఉదారగుణసంపన్నులు, అమృతరూపము నరించిన వివరములన్నియుఁ దా మెఱింగించి మమ్ము సమాశ్వాసింప సమర్థులుకదా!

తార:—మాకర్తవ్యమంతయు నిప్పుడే విశదీకరింపవలయునని ప్రత్యుత్థానమొనర్చుకొనుచున్నాము.

మాయా:—ఓయీ! ఆవిషయముంగూర్చి మీయాచార్యు నడిగి తెలిసికొనఁజాలరనిమా? పరిహాసమున కటులంటిఁగాని యిందలి యాథార్థ్యమును బాలమాత్రఁడే మెఱుంగును? మీరు చక్కఁగా యోజించియే నన్నిట్లర్థించుచున్నారుకదా!

తార:—దేవా! ఈవిషయమునునిర్ణయించుకొనుట మాకత్యంతావశ్యకము. మామనస్సంతయు నావైపునకే లాఁగికొనుచుండ మేమూఱటఁ జెందఁజాలము.

మాయా:—ఔనౌను. మీ రెఱుంగఁదగిన యంశమదియే కదా! ఇఁక మీరట్టి ప్రమాదములఁగూర్చి యించుకంతయు భయమందవలదు. మహేంద్రాదులు వైకుంఠుని యాశ్రితవర్గములోని వారని మీకుఁదెలియుఁగదా! ఆశ్రితవాక్యములు మన్నించి యా

మహావిష్ణువు గోరూపముఁదాల్చి మీ యెడల నప్రియమొనర్చెను. ఇది నిగూఢమైనవిషయము. నేనాతని వైఖరి బాగుగా నెఱుఁగుదును కావున మఱుఁగువెట్టక మీసమక్షమున వివరించితిని. ఇంక నాతని యుక్తులకు మీరు వెఱవఁబనిలేదు. కాఁగలకార్యములు మీకు నేను సిద్ధింపఁజేసెదను.

విద్యు:— ఔరా! వైకుంఠుఁడెంత మోసమొనర్చుచున్నాఁడు!

తార:— ఆయనకేమపకారము లొనర్చితిమని ?

మాయా:— అది వేఱువిషయము. ఆశ్రితరక్షణ మాతని యుత్తమోత్తమ ధర్మమార్గమని యీవఱకే తెలుపఁబడెనుకదా! అందులకై యెన్నిమాఱులో నగతుల సాధించుటకాతఁడు మాయలనే ప్రయోగించి తనపూన్కి నెఱవేర్చుకొన యత్నించును. ఇదియే యాతని మూలాదర్శము.

విద్యు:— (యోజించి) నిశ్చయముగనటులే; మీరు తెల్పిన దంతయు నిప్పటికిఁ దెలిసినది. దీనికిఁ బ్రతిక్రియగా నింక నేదైన నొనరింపఁదగినదే —

తార:— (యోజించి) నిశ్చయముగ జరుపఁదగియే యున్నది.

మాయా:— ఇప్పుడు మీ రేమియు వేగిరపాటు పొందవలదు. నేను మీపురములకు విచ్చేసి మీకధికోత్సాహముఁ గూర్తును.

నార:— (స్వగతము) మంచిది! వీరి సాంప్రదాయములిఁక గుర్తింపుము.

తార:— దేవా! మీ సమాశ్వాసంబున మాహృదయాందోళనములు తీఱినవి.

విద్యు:— మీనుడివినదంతయు సమంజసము. ఇందు విపరీతమేమియు లేదు. మానిశ్చయమునకు సరిపడురీతిని మీరు వెల్లడించితిరి. దేవా! మీరిఁక మాపురములకు దయచేసి మా యాతిథ్యములు స్వీకరింపుఁడు.

మాయా:—(నవ్వుచు) ఆతిథ్యములు స్వీకరించుటతో దీక్షనా ?

నార:—వారి మతమునుగూడ మీ రవలంబింపవలయునని కోరుచున్నారు.

విద్యా-తార:—(ఊరకుందురు.)

మాయా:—గడువు సూపకుఁడు.

విద్యా:—అందులకుఁగాదు. మాకమలాక్షుని విజయము చూచి యాయనకుఁ దమరాక యెఱింగించి—

మాయా:—ఓహో! అటులే కానిండు. అది యుక్తమే; ఆవఱకు మీయాతిథ్యములు మాకుఁజాలును.

నార:—(జనాంతికముగా) బిడ్డబ్రతికినది; బాలసారెకింకేమి తొందర ?

(అందఱు నిష్క్రమింతురు)

[తెర వ్రాలును.]

---

## 3 వ, దృశ్యము.

---

(ప్రదేశము—చైత్యనగరము.)

[ప్రవేశము:—మాయామయుఁడు—నారదుఁడు]

మాయా:—నారదా! చూచితివికదా యీనగర మెంత రామణీయకముగనున్నది? ఈ సభామంటపము లేమి? ఈ వేదాధ్యయనశాల లేమి? ఎందుఁ దిలకించినను మనోహరములగు దేవాలయములు—ఎచ్చట వీక్షించినను సువర్ణపరిశోభిత కూటాగారములు—ఏవైపునఁ బొడఁగాంచినను రత్నకుడ్యనిర్మిత పానీయశాలలు—ఏప్రదేశమునఁ జూచిన బహువిధపుష్పఫల పరిశోభితో

ద్యానవనంబులు—అద్దిరా! హృదయాహ్లాదకరంబులై యలరారు చుండెనే! విధాతృని యనుమతింగొని మయుఁడుకదా తన విద్యా నైపుణ్యమున దీని నిర్మించినది! ఎనలేని సౌఖ్యముల కాలవాలమై, లక్ష్మీనివాసయోగ్యంబై యలరారు నీపట్టణరాజంబున నివసించు దానవు లెంత యదృష్టవంతులు! ఇట్టి మహైశ్వర్యమును నిలుపు కొనఁజాలకకదా వీరు దయా సత్య శౌచాదులు విడిచి గర్వోద్రిక్తులై లోకకంటకులగుచున్నారు. కేవల పాపంకమగు ప్రబోధ మునఁగాని వీరి నథఃపతితులఁజేయుమార్గ మన్యథా కాన్పింపదు. కావున నేనొనర్చు ప్రబోధములన్నియు వారి గరిష్ఠత్వమును రూపుమాపి, సర్వానర్థబీజమైన మమత్వము వారియందినుమడింపఁ జేయుఁగాక!

నార:— దేవా! నీయాలోచనంబున కన్యథాత్వంబుకల్గునా? ధర్మాధర్మములకుఁ బోరుగావించి, ధర్మముచే నధర్మమును, నధర్మ ముచే ధర్మమును సుప్రతిష్ఠించుకొను నీలీలలు పరమాద్భుతములు కదా!

(అనుబంధము ౪.)

దేవా! కార్యజ్ఞుఁడవగు నీవు సకల రహస్యములు నెఱుంగుదువు. దైత్యధర్మవినాశమునకై మున్ముందెట్టి జరుపఁదగినది విచారించితివి కదా!

మాయా:— (యోజించి) అవును. అదియు విచార్యమే; ఇంతదనుక మన మేకాంతముగ మాటలాడినంతను ముఖ్యవిషయము తేలినది. త్రిపురకాంతలు మహాపాతివ్రత్య సంపన్నలని కర్ణాకర్ణిని వినియున్నాను. ప్రపంచమునఁగల వనితాలోకమంతయు వారిధర్మ ప్రవణత, నైసర్గికశీలములనుజూచి ముగ్ధమగుచుండునఁట! కావున నేను వారికి దర్శనమొసఁగి, ప్రియాలాపములతో సంభావించి పరిచయమొనర్చుకొందును.

నార:— దేవా! అదియే యిప్పుడు జరుగఁదగినది. కాని పురదైత్యుల నొడంబఱచికదా యంతిపురమునఁబ్రవేశించి స్త్రీలతోఁ

బ్రసంగించుట! అది యిప్పు డసంగతముగాఁ దోఁచినది. ఏమన, నింతదనుక మనలను మఱచిపోవునంత కార్యభారమున మగ్నులై యుండుటచేతనే వారు మనకింకఁ దమ సభాభవనమునకుఁ బిలిపింపరైరి.

మాయా:—సందియమువలదు. మనకనుకూలించునటు లే యాహ్వానము రానున్నది. కార్యమంతయు నిఁకమీఁదఁ దేటపడనగును. (పరికించి) అదుగో! వార్తాహారుఁడెవ్వఁడో మనదెసకే వచ్చుచున్నాఁడు, చూడుము.

[అప్పుడు ఒకానొకభటుఁడు ప్రవేశించును.]

భటు:—దేవా! మాప్రభువులిప్పు డింద్రలోకమునకు దండయాత్ర వెడలనున్నారు. వారు విచ్చేయుదనుక దమ రిక్కడ నుండఁదగుదురని విన్నవించుకొనుచున్నారు. అతిథిసత్కారముల కన్నియు సంసిద్ధములే.

మాయా:—అట్లయిన వెళ్ళవచ్చునని చెప్పు. త్వరపడిపో. ఇంక నొక్కనిమిషమైన నాలస్యము చేయరాదు.

భటు:—చిత్తము. (నిష్క్రమించును.)

మాయా:—నారదా! కార్యానుకూలత యెట్లు జరిగెనదో చూడుము!

నార:—తలఁచుకొనినతీఁగె కాలికిఁదగిలినది. దేవా! సంకల్పసిద్ధుఁడవు కదా!

తే. విశ్వమంతయు నవలీల వెలయఁజేసి
సమయఁజేతువు కూర్తువు సమయమెఱిఁగి
యిది నవీనముకాదు నీ యిచ్ఛ సుమ్ము;
నిన్ను భజియింప మముబోంట్లు నేర్తురయ్య?

మాయా:—సరియే, నా కార్యమున నేనిఁక నప్రమత్తుఁడనయ్యెద. నీవిఁక వెళ్ళవచ్చును. (నిష్క్రమించును.)

నార:—(ఆశ్చర్యముగ) ఔరా! ఇంతయేనా చెలికారము! బాగు, అవసరమున్నంతకుమాత్రమేకదా ప్రభువర్యులెల్లరను దమవారినిగా లాలింతురు. సరియే; జీతబత్తెముతెఱుంగని నా యీ సేవకీమాత్ర మనుసరణీయమే.

చ. అనయము ఘోరపాతకములన్నియుఁ బైకొని చుట్టుముట్టినన్
వినయ విధేయవర్తనలు వీడినవాఁడని లోకులాడినన్
దనువుఁ దొఱంగఁజేయు వివిధ ప్రతిరోధము లెన్నికల్గినన్
దన ప్రభునాజ్ఞయీత జవదాఁటమి సేవకధర్మమే కదా!

(నిష్క్రమించును.)

[ తెర. ]

ఇది తృతీయాంకము.

———

శ్రీ

# త్రిపుర విజయము.



## చతుర్థాంకము.



### ౧ వ, దృశ్యము.

(ప్రదేశము—అమరావతియందలి కమలాక్షుని శిబిరము)

[ప్రవేశము:—కమలాక్షుఁడు—భటుఁడు.]

భటు:—దేవా! అదేమి నాపాపమో కాని, యీ పాడు లోకమునఁ బ్రవేశించినదాది నాకేమియు సంతృప్తి కలుగకున్నది. ఈ దేవలోకము గొప్ప వైభవములకుఁ దలమానికమనియు, దీని దర్శించుట దుస్తరమనియుఁ దలంచి నాయదృష్టము నగ్గడించుకొని యిబుసుపోకకు దేవరతోఁ బయనించితిఁగాని, దీనిఁ జూచిన పిమ్మట నా యాశలన్నియు నడుగంటినవి. దీనికంటె సర్వవిధముల మనపట్టణములు మనోజ్ఞములై యుండ దేవర యానందించు విషయమిందేదియో తెలియకున్నది. అబ్బబ్బా! ఇక్కడి వాతావరణస్థితి నిర్మలమైన నాహృదయమును జెఱుచుచున్నది. వచ్చిన తడవుగఁ బడిసెము పట్టుకొని తలదిమ్మ వదలకున్నది. ఆ గంగానది యొడ్డున మఱినాల్గుపూటలు గడపుదురా నాయాతన వేఱుగాఁ జెప్పవలసినదేమి? నాయందు దేవరకుఁగల ప్రేమాతిశయమునఁ గదా యీరహస్యప్రదేశమునకు వసతిమార్చి యింగితజ్ఞులైతిరి.

కమ:—ఓయీ! పానము, మహాసంగ్రామములోనర్చి విసిగి వేసారినట్లు మాటలాడుచున్నావు; కాకున్న నీకిందేమి శ్రమకల్గినది?

భటు:—దేవా! ఊరక నన్ను నిందింతురేల? నేనుచేసిన యద్భుతకార్యములన్నియు మఱచిపోయితిరా? మొన్న మొన్న నే యూర్వశిని బెదరించినతరువాత రంభనుగూర్చి యెంతప్రయత్నించితినో తెలియ లేదా?

కము:—అదేమో తెల్పుము.

భటు:—గడుసు తొత్తుకూతురు నన్ను దూరములోఁ జూచినదే తడవుగ నొక్కపరుగున సందుల గొందులఁ దూఱి చాల మోసగించినది.

కము:—నిన్ను బెదరించినదా యేమి?

భటు:—ఇహీఁ! దానినెత్తి;

కము:—అటులయిన నీవేమిచేసితివి?

భటు:—ఒక్కతూరికాదు; అనేకపర్యాయములు — అటు చూపియిటు—ఇటుచూపియటు—ఇట్లే గుంటనక్కలాగున, తుద కెక్కడనో నక్కినది.

కము:—ఇందు నీవుచేసిన పని యేమున్నది? ఊరకశ్రమ పడితివి.

భటు:—ఊరకవత్తునా! ఒక పెద్దరాయిపట్టుకొని దాని మీఁదికి తీవ్రముగ విసరివేసితిని.

కము:—చివరకిది ఘనకార్యమే లే—ఇంకేమి చేసితివి?

భటు:—ఏమిచేసినను నాకష్టము మీరేమిచూడవలయునా? ఉక్కతునుకవంటి నాయీశరీరము దినదినము కార్శ్యముఁజెందుచున్నను బట్టువిడక, యెదురుదెబ్బకు లొంగక, హస్తమాత్రపు పనులన్నియుఁ జేసితిని. తమకేమి మహాప్రభువులు! బరువుమోయఁదగు శక్తియున్నంతకుఁగదా గుఱ్ఱము నుపయోగింతురు. దేవా! ఇంక నింటిపై నాకు మనసుపోయినది. ప్రతిదినము నిదురపట్టక బెగ్గడిల్లుచున్నాను.

కము:—అటులైన నిక్కడ నీభోజనమునకేమైన లోటు కల్గినదా?

భటు:—పూర్తిగాఁ గల్గినది. మునిముచ్చులందఱు నిన్ని దుంపలుతిని, రెండు మంచినీళ్ళుత్రాగి, యెక్కడనో పండుకొని, యాడువారు మగవారుఁ గలిసి, యరమరికలు, యెబ్బెటికములు మాని, తిరుగుచుండ, నేను వారింజూచి సిగ్గుపడి యాఁకలిదప్పులు మఱచిపోవుచున్నాను.

కమ:—ఇఁక నీవెక్కడకు వెళ్ళనక్కఱలేదు; నా చెంతనే యుండుము. వలసినన్ని సదుపాయములు చేయింతును. ఇదిగో! ఈ యమరావతియందలి యైశ్వర్యములన్నియు నీకొఱకే.

భటు:—దేవా! అట్టికోరికతో నేను బయలుదేరితినా? ఇప్పుడుకాదేని, దేవరయనుగ్రహమున్నఁ గొదవయేమి? ఇంటిపైఁ గల ధ్యానముచే నిట్టి బతిమాలికలుగాని, నాపనిలో నేనేమైన మందగించితినా? ఇదిగో! ఈవైపుచూడుఁడు! నందనోద్యానము శోభతఱిఁగి యెట్లున్నదో! విచ్చుఁగత్తులతో నొకమూలనుండి వనమంతయుఁ జెండి చెకపికలాడించితినికదా! ఆవైపున మునిముచ్చుల దుండగములు చూచితిరా? రేయింబవళ్ళు నెలుగుగొడ్డుల వలె బొబ్బలిడుచు యజ్ఞవేదికలచుట్టునుమూగి స్త్రీపురుష మర్యాదలువిడిచి గొంతెమకోరికలతోఁ గెవ్వున కేకలువేయుచుండ నందఱ నదరించి బెదరించి, మాటలు చల్లార్చి శాంతి యొనరించితిని. ఈప్రాంతమునఁ జూడుఁడు. మేనకనివసించుచున్న కొంప మూలమట్టముగఁ గూలనేసితిని.

కమ:—బాగు బాగు. అద్భుతకార్యములొనర్చి ధైర్యముఁ బ్రకటించితివి. ఇంకమనము మహేంద్రునిపైకె విక్రమింపవలసి యుండును కాని, యాకార్యముమాత్రము మా యగ్రజులకొఱకు నిలిపివైచుట యుచితము. ఏమన, వారు సర్వకార్యనిర్వహణ ప్రతిభావంతులు కదా!

భటు:—అది సమంజసమే; అటులయిన నాకొఱకు మంచి యుపకారముఁ దలఁచుచున్నారు. పనసతొనజాజి తేనెలోఁబడినట్లు

నేనిప్పుడే పోయి యామహారాజులం గలిసికొందును. వారునామెడఁ బరమదయాళువులై నాకు శ్రేయస్కరముగాని పనులు నియోగింతురు.

కమః—(నవ్వుచు) ఓయీ! అపూర్వబుద్ధిమంతుఁడా! ఇదియా నీయాలోచనము! అత్యంత హితకారివని నిన్నుఁ జేరఁదీయుట మట్టిగుఱ్ఱముతో నీటిలో దిగుటవంటిది. నీయుద్దేశము గ్రహింప నిట్లంటిఁగాని, నిజముకాదు.

తే. మంచిచెడ్డలు మది నిర్ణయించుకొనక
కష్టసుఖములమాట యక్కఱకు వలకు
పగఱ సాధించుటకు నేతవలయు, నంత
జరిపిచూచుట మనప్రయోజనము సుమ్ము.

భటుః—దేవా! అట్లైన నే నిప్పు డనుగ్రహింపఁబడితిని. ఇంకేమో యెందరని నామనస్సు తలపోఁతలతోఁ బలుపోకలుపోయి నదికాని జంకుఁగొంకులు లేని నాప్రతాపమింకను గావలసినంత యున్నది. ఇంక, యేలికయాజ్ఞను మన్నించి యిదిగో వెంటవత్తును. పయనముకండు.

కమః—ఇప్పుడు మన మేమిచేయవలయును?

భటుః—మహేంద్రుని సింహాసనమధిష్ఠింపవలయును. మన పట్టణములలో విజయపతాకములు నెలకొల్పవలయును.

కమః—సంశయమేమి? మహేంద్రుఁడు మనకిప్పుడు కీలుబొమ్మ.

భటుః—మహారాజా! కానిమ్ము; కాదేని యున్నినాళ్ళకొక్క తూరియైన నెదిరింపఁగలుగఁడా? (పరికించి) దేవా! సముద్ర తరంగమువలె వచ్చుచున్న యీసేనాసముదాయ మెవ్వరిది?

కమః—(చూచి) ఓహో! అదియంతయు మనసైన్యమే. ఇట్లే వచ్చుచున్నది (పరికించి) ఎవరా వచ్చునది?

[అప్పుడు ఒకానొకభటుఁడు ప్రవేశించి]

దేవా! అగ్రజులిరువురు నమరావతిని సంపూర్ణముగఁ గొల్లలాడఁదలఁచి పయనించిరి. సైన్యములు దిగ్బంధనమొనర్ప సిద్ధముగ నున్నవి. వెంటనే పురమునకు విచ్చేసి మాయామయునితో నిష్టాగోష్ఠిజరుపుచుండవలెనని వార్తనంపిరి.

భటు:—(నూతనభటునితో) మీకేమాత్రొందర? ఇప్పుడు సాయంసమయమైనదికదా! ఇక్కడ మునులయాగముల హవిర్భాగములు గైకొని మా యీ మహారాజుగారు మహేంద్రత్వ సిద్ధిఁ గైకొన్నఁగాని వదలిపోయెద ననుకొంటివా?

కమ:—(నవ్వుచు) ఓయీ! స్నేహితుఁడా! అగ్రజుల యాజ్ఞ నిరాకరింపఁదగదు. ఏతత్కారణమంతయు నే నానుపూర్విగ నీకెఱిఁగించెదను. త్వరపడిపోదము రా.

భటు:—అటులు తెల్పకున్న నీయెదుటనే యురిపోసి కొందును. పిమ్మట నిరాశుఁడనై నాకొఱకు విలపింతువు.

కమ:—సరే; ఇఁక నడు.

భటు:—అమ్మయ్యా! ఇప్పుడుకదా బెంగనుండి తేరి కొన్నది నాప్రాణము—

(నిష్క్రమింతురు)

[తెరపడును.]

---

## ౩వ దృశ్యము.

ప్రదేశము—సుధర్మ

[ప్రవేశము—సింహాసనాసీనుఁడై ఇంద్రుఁడు]

ఇంద్రు:—అక్కటా! ఇట్టి విషమపరిస్థితియందు నీత్రివిష్టప నివాసులకుఁ దప్పనివిధియగుచున్న దాత్మపరీక్ష. ఏమైనను గొంత శాంతించినచోఁ బ్రతివిధాన మాలోచింపఁబడునని వైకుంఠుని నిశ్చయము. ధర్మసమారంభమునకుఁ గాఁదగినదంతయు నాదైవమే

యనుసంధించుఁగాక! లోకాతిశాయి మహాప్రభావ సంపన్నుం డైన యా మహానుభావుఁడు తనధర్మము నిర్వహింపక మానఁడు. సమస్త భూతహృదయ గతాభిప్రాయము లెఱింగి యుచితరీతిని శ్రేయంబాపాదించు జగత్త్రాతకుఁ దెలియని దేమున్నది? (యోజించి) హా! త్రిలోకాధీశ్వరున కెంతకష్టము కలిగినది! ఇంతలో దనుజవిక్రమంబులు నెట్టిరూపముఁదాల్చి యెట్లు పరిణమించునో కదా!

కంచుకి:— (ప్రవేశించి భయముగా) ఏమో; తెలియదు.

ఇంద్రుః— (చూడకయె) అటులైనఁ గాలోచితమగు ప్రతిక్రియ లొనర్చుకొనుటకై మార్గము లేదా?

కంచు:— ఏమో తెలియదు దేవా! తెలియదు.

ఇంద్రు:— (కోపముతో) తెలియదా నుఱి? మూర్ఖా! ఎవఁడవీవు. ఏమి తెలియదు?

కంచు:— దేవా! వీఁడు కంచుకి.

ఇంద్రు:— (చూచి) పౌలోమి యెక్కడ?

కంచు:— దేవా! తెలియదు తెలియదు.

ఇంద్రు:— ఛీ! అంతఃపురవార్తలు తెలియకున్న నీ వెందుకు?

కంచు:— మహారాజ్ఞి యంతిపురమును విడిచి—

ఇంద్రు:— ఎక్కడనుండెను? జయంతకుమారుఁ డెక్కడ?

కంచు:— (ఒడలు తడువుకొనుచు) వారొకజాబు నా చేతి కిచ్చి యావైపునకు వెడలిరి. (అని కన్నీరునించును.)

ఇంద్రు:— అది యేమి చేసితివి?

కంచు:— మార్గమధ్యమున నొకానొక—

ఇంద్రు:— రాక్షసునిచేఁ జిక్కువడియెనా? అయ్యో! ఎటుచూచినఁ గష్టతరమై యమరావతియందు జీవయాత్ర గడపుట యశక్యమని యెఱుంగదు కాఁబోలు పౌలోమి!

[తెరలోఁ గలకలానంతరము]

ఇంద్రు:—హా! యెంత దయనీయస్థితి! దుర్భరము—హృదయమర్మములఁ జెల్లగించు నిట్టి దుర్వార విఘ్నవ్యాపారోద్యోగములా! ఔరా! విధిపరిపాక మవిలంఘనీయముకదా. (పీఠము డిగ్గి) ఓచింతామణీభద్రపీఠమా! బహుకాలము నిన్నధిష్ఠించి దేదీప్యమానమహావైభవముతోఁ గొలువుదీర్చి జగదభ్యుదయమునకై సేవసల్పిన యీపాకశాసనుఁడు నేఁడు మందప్రజ్ఞుఁడై కర్తవ్యమెఱుంగక విలపించుచున్నాఁడు.

భటు:—(ఆత్రముతోఁ బ్రవేశించి) దేవా! ఇంక జాగొనరించినఁ బ్రయోజనము లేదు.

ఇంద్రు:—ఇప్పుడెట్టి దుష్పరిణామము జరిగినది?

భటు:—వేలకొలఁది రాక్షసులువచ్చి మహర్షులుచేయు యజ్ఞములు ధ్వంసమొనర్చుచుండిరి.

ఇంద్రు:—వారటులు చేయుటకు మున్ను ఋషులతో నేమి మాటలాడిరి?

భటు:—"మీరీ యజ్ఞము లేల చేయుచున్నారు? ఇంద్రుఁడు వీనికధిదేవతయెట్లు? అతని యాజ్ఞవలననే మేఘములు వర్షించుచుండునా? దొంగలారా! మీరందఱు లోకమును మోసగించుచు దుష్కార్యము లొనర్చుచున్నారు" అను నీపాడు ధోరణితోఁ గలహము ప్రారంభించి బతిమాలినను విడువక పశుబలముఁ జూపి వెఱపుఁ గొల్పుచున్నారు.

ఇంద్రు:—ఔను. పాషాణహృదయులిట్టి యవ్యవస్థితములు, నవినీతికరములునగు దుర్భాషలాడునంతటి దార్ష్ట్యమేమి? ఇంతకు దివ్యుల యదృష్టలక్ష్మి తొలఁగిపోవుచుండ గుణహీనులని వారి నేల నిందింపవలయును! ఓయీ! దిక్పాలకుల హెచ్చరికలన్నియు వ్యర్థములైనవా యేమి? విధివిరామములు లేని యీ భయంకరధ్వానము లెందుండి వినవచ్చుచున్నవి?

భటు:—(పరికించుచు నిష్క్రమించును.)

[తెరలో]

సంక్రందనా! నిలునిలు. పురత్రయాధిపతులకు దర్శనమొసంగి, స్వాగతోక్తులు పల్కుము.

ఇంద్రు:—(ఆకర్ణించి) హా! యెంతటి వైపరీత్యము; ఆపాతదుస్సహమైనదికదా యీతీవ్రవేదన!

[అప్పుడు మాతలి ప్రవేశించుచున్నాఁడు.]

మాత:—దేవా! మాతలి; రథముసిద్ధము.

ఇంద్రు:—రథము! రాణీవాసము వైపునకే;

మాత:—(విచారముగా నడుచుచుండును.)

భటు:—(మరలఁబ్రవేశించి) దేవా! భగ్నమైన యీ నందనవనమునకెదురుగాఁ గూర్చుండి జయంతకుమారుఁడు దేవిగారును విచారించుచు, దిక్పాలకులంపిన సానుభూతులకు బదులువ్రాయుచుండగా నమృతభాండమును శోధించుటకై కొందరు మునీంద్రు వచ్చిరి.

ఇంద్రు:—అటులయిన వారు దానిని దొంగిలించిరా యేమి?

భటు:—లేదు. సురక్షితముగనున్నది.

ఇంద్రు:—సరియే; ఇఁక వ్యవధిచాలదు. కామగవియు, నమృతభాండమును వేగనే గొంపోవుఁడు. ఈ తడవ వచ్చునది భయదతరంగము. రథము నటువైపునకే;

మాత:—అక్కడినుండి?

ఇంద్రు:—మేరుపర్వతగుహలకు—

మాత-భటు:—(నిట్టూర్చి) హా! కష్టము కష్టము.

ఇంద్రు:— కార్యభంగము కాకుండున ట్లనుసంధింపుఁడు ప్రయాణము.

మాత-భటు:—దుర్భరము, దుర్భరము.

[ఇరుగురు నిష్క్రమింతురు.]

ఇంద్రు:—హా! తమ్ముఁదాము తెలిసికొనఁజాలక కేవల చిత్తవిభ్రాంతులై సంరంభించుచున్న యీదానవహతకుల కీపు హేం

డు౯ఁడు వెఱచి కేవలము విధిదుర్విపాకముచే నన్నియునువిడిచి తల దాఁచుకొనుచున్నాఁడు. కరుణాస్పద హృదయులగు మీరెల్లరు సాక్షిభూతులరై యనుగ్రహింపుఁడు.

తే. పరమపావనులార! దిక్పాలులార!
గ్రహగణములార! దైవమూర్ధన్యులార!
ప్రతిసూల్యవిధిన్ దాఁటఁ జేతగామి
నరుగుచుండె సురాధిపుం డబలుఁ డగుచు.

హా! సురాధిపుఁడుగాఁడు, వీఁడు శచీప్రియుఁడుఁ. అతఁడునుగాఁడు; ఛీ! మలీమసుఁడు.

[తెరలో]

దేవా! మాకందఱకు నేమి నియోగించుచున్నావు?

ఇంద్ర:—(చూచి) ఓహో! త్రివిష్టప నివాసులగు నో మహానుభావులారా! మీరందఱు నాసందేశమునకై వేచి యున్నారా? ధర్మస్వరూపులు—తపోవిభూతి సంపన్నులు— విశేషించి కాలత్రయస్వభావజ్ఞులు. మీకుఁదెలియని పవిత్ర ప్రసంగములు మిగిలి యుండునా? అయినను, నిరంతరము మీరు నాధర్మము ననూచానముగ నిర్వహించి యనుసరింపఁదలఁతురేని నాయీప్రార్థన మన్నింతురుగాక!

సీ. ప్రేమస్వరూపాభిరాముఁడై వెలసిన
పతితపావనుఁగాఁ బాడుకొనుఁడు
సకల ధర్మాధర్మసారనిర్ణయకళా
పారంగతుని ప్రాపుఁ గోరుకొనుఁడు
సుఖదుఃఖములు లెక్కసేయక మీ సర్వ
విభవముల్ ప్రభున కర్పించుకొనుఁడు
శాశ్వతంబైన నిశ్చల పరబ్రహ్మంబుఁ
జేరి వేడ్క నుపాస్తి చేసికొనుఁడు

తే. కానలోఁ గొండబిలములో, కలవు చాల
హాయిగా విశ్రమింపఁ దొందైన మీరు
సకలలోకాభినంద్య ప్రశస్తకీర్తు
లార! బుధులార! సురలోకపౌరులార!.

(నిష్క్రమించును.)

[అప్పుడు విద్యున్మాలి, తారకాక్షుఁడు, భటుఁడు ప్రవేశింతురు.]

తార:—(కోపముతో) మహేంద్రా! వెడలకు వెడలకు.

సీ. తారకాసురుని దోర్దర్పంబుఁ గనలేక
యేడ్చుచు నడుకాన కేగునాఁడు
అమరావతిని గొల్లలాడి మావారెల్ల
దిట్టరులై బ్రివ్వదిట్టినాఁడు
నెక్కటిపోరుల సుక్కిక్కు రక్కసులన్న
గుండియల్ బిగబట్టుకొన్ననాఁడు
తాళఁగాఁజాలమీదైత్యులనుండి ర
క్షింపుమంచును విష్ణుఁ జేరునాఁడు

తే. కానవో, చేవతఱిగెనో, కఠినశైల
పక్షములఁ గూల్చు శతకోటి పస యడఁగెనో
మందమతివైతివో శతమన్య నీవు
త్రిపురదైత్యప్రతాపముల్ తెలియవొక్కొ!.

విద్యు:—(కోలయం గని) ఏఁడీ, మహేంద్రుఁడే లేఁడా! హృదయ సంక్షోభమొనర్చి యవశమైయున్న నాయీకోపాగ్ని కింధనమే లేకపోయెఁగా!

భటు:—(కంచుకిని నిరోధించి) దేవా! ఇతఁడే కాఁబోలు మహేంద్రుఁడు; చూడుఁడు. (అని యతని చేతులను గలియఁగట్టును)

విద్యు:—(చూచి) ఇది దెబ్బతిన్న కాకి—

తార:—అటులైన శిక్షాపాత్రునిఁగాఁ జేయకుము బడుగును.

కంచు:—(తలవంచుకొనును.)

విద్యు:—(పరిహాసముగా) అంతమహాతేజశ్శాలి కింత యవమానము తగదు.

తార:—ఆసవాలుంచి వంపివేయుమీ యనాథ పేౖతమును.

కంచు:— (స్వగ) బ్రతుకు జీవుఁడా బ్రతుకు.

భటు:—ఇక్కడి విశేషములన్నియుఁ బరికించినపిదప వీని విడుదల.

కంచు:—(డిల్లపడి) కొంపనుంచినాఁడురా దైవమా!

తార:—(భటునితో) మనప్రధానలక్ష్యము స్మరింపుము.

భటు:—దేవా! మసల లేదు. ఆత్మను రగిలించుచున్న మహేంద్రుని దుష్టగాథలు నేనుమాత్రము సహింతునా? ఆతని వెదకికొనుచు నీమార్గమునే యనుసరింతము (ఇంద్రుని సింహాసనముం జూపి) ఇదే మహేంద్రుని సింహాసనము. దీనినధిష్ఠింపుఁడు.

తార:—(వికటముగ) ఛీ! దీనినధిష్ఠించిన మహావరాక్రను శాలికి వేయికన్నులుండవలెను. నడు.

[అందఱుఁ బరిక్రమించి చిత్రశాలయందుఁ బ్రవేశింతురు.]

విద్యు:—(చిత్తరువుఁజూచి) ఆచిత్రమెవ్వరిది!

భటు:—అది ప్రాఁతవడిన దంపతులది.

తార:—ప్రాఁతవడినది పాతఁబడినస్త్రీయున్నది.

విద్యు:—మహేంద్రుని యనివారితమగు ప్రేమకిరణములకుఁ, బౌలోమి పారవశ్యవీక్షణములకు నిది యంత్రిమభిక్ష.

అందఱు:—అహాహా! (నవ్వుదురు.)

తార: — అడుగునకు దూరమైనను దీనియాత్మయందే మహేంద్రుని మనుగడ యంతయు,

అందఱు:—(అట్టహాసమొనర్తురు.)

భటు:—(రెండవచిత్రముఁజూపి) ఇది తండ్రి కొడుకులది.

తార:—వాడిచూపులకొడుకు. తండ్రివలె సహస్రాక్షుఁడు కాఁడుగదా!

విద్యు:—కీరంమన్యుఁడగును—జనకుని ప్రతాపోత్కర్షముల నసహ్యించుకొనుచున్నవి చూడ్కులు.

తార:—అటులయిన వీఁడును బూజ్యుఁడే; ద్వసహస్రాతుఁడు.

అందఱు:—(నవ్వుదురు.)

విద్యు:—(భటునితో) ఓయీ! గొప్ప బహూకరణము లన్నియు మావలన నీవు లాగికొనునట్లున్నావే;

భటు:—(హర్షముగా) చిత్తము; అనుగ్రహపాత్రుఁడే మందభాగ్యుఁడు. (అని యింద్రుని వేఱొకపటముం జూపుచు) గౌతమ శాపమునకుఁబూర్వము చూడుఁడు.

విద్యు:—(చూచి) ఛీ! అసహ్యము. నిందనీయము.

భటు:—వెనుకటికంటె నీధూర్తమయాంగము మేలే; (అని మఱొకటి చూపును.)

అందఱు:—(నవ్వుదురు.)

భటు:—(పరిక్రమించి) ఇవియన్నియుఁ బురాతనచిత్రములు, పురాతన నిర్మాణములు కావున; ననుబోటి నాగరకుల కివియన్నియు వ్యయమూలకములే;

విద్యు-తార:—వ్యయమూలకములు (నవ్వుదురు.)

భటు:—(పార్వతీ పరమేశ్వరుల పటముం జూపి) ఇదే పురాణదంపతులు.

తార:—(కోపముతో) బండజాతిపైఁ బాఱవేయుము.

భటు:—(వేఱొండు చిత్రముం జూపి) లక్ష్మీనారాయణులు!

విద్యు:—సముద్రములోనికి—

తార:—పాలసముద్రమోయి, పాలసముద్రము.

భటు:—అటులే (తీసివేయును.)

విద్యు:—ఇంకఁ జాలింపుమీగొడవ; కాలహరణము.

భటు:—దేవా! ఆశ్చర్యమాశ్చర్యము. ఇది బ్రహ్మదేవుని పవిత్రచిత్రము. (అని పటముం జూపును.)

విద్యు:—భద్రపఱుపుమిది. వరప్రదాయకుఁడగు నీతఁడు పూజనీయుఁడు. పుణ్యానుభావ దర్శనుఁడు. శత్రుభయమునుండి తప్పింపుమీచిత్రము. (తారకాదునితో) సోదరా! చూడుము; ఇది పితామహుని దివ్యచిత్రము. కల్యాణాంకురములకిది జన్మభూమి. ఆహా! ఆనాఁడు సాక్షాత్కరించిన దేవదేవుఁడు (కన్నుల నద్దుకొని) బాపురే! చిత్రకారుని నైపుణ్యమెంతయుఁ బ్రశస్తిఁ గాంచినదికదా!

తే. కన్నులకుఁ గట్టినట్లు మున్ గన్నరూపు
చిత్రమున వ్రాసి యీమోదసింధువునను
నోలలాడించెనే! పుణ్యోత్తముండు
చిత్రకారుఁడాతఁడు నుతిసేయఁదగఁడా!.

తార:—వలదు; అటులనఁజనదు. శత్రువైభవమునకు నిదర్శనమగుచున్న చిత్రకారుని మహిమాభివర్ణన మప్రస్తుతము. పదంపడి దీనిని బరామర్శింతము.

భటు:—(మఱొకపటముం జూచి గుండె బాదుకొనుచు) దేవా! సప్రమాదము; మన్నింపుఁడు మన్నింపుఁడు.

తార:—ఏమది? దుష్ప్రదర్శనీయములగు దృశ్యములఁ బొడఁ గాంచితివా?

భటు:—హా! యొడలు కంపమెత్తుచున్నది.

విద్యు:—కడచిన విషయములం జూచి యింతయారాటమా?

భటు:—ఇప్పుడు జరిగినట్లున్నది చూడుఁడు; తండ్రిగారి మరణమును; కుమారవిజయములనుగూర్చి ధూర్తుఁడగు చిత్రకారుఁడు పటమును చిత్రించినాఁడు.

తార:—(చూచి కోపముతో) ఛీ; ఎవఁడీచిత్రకారుఁడు? దర్శనమాత్రమున సంక్షోభమునొందించి శల్యములఁ గదలించు నిట్టి చిత్రమునా వ్రాయుట?

విద్యు:—(చూచి) ఇది చిత్రకారుని తప్పిదముకాదు.

ప్రమందువా, దీనినిట్లు నిర్మింపఁదలచినవాఁడు దీర్ఘమత్సరుఁడు, అప స్మారుఁడు.

తార:—వాఁడే మహేంద్రుఁడు. ఇది తనసాన్నిధ్యము నందుంచుకొని సురరాజ్యసింహాసనము నధిరోహించుటకైన సిగ్గు లేకపోయెఁగాఁబోలు! (యోజించి) అటులుకాదు; తండ్రిగారి స్మారకచిహ్నము మహేంద్రునకుఁ బూజనీయమైనది. (ఇంద్రు నుద్దేశించి) ఔరా! మహేంద్రా! ఏమి నీపొగరు? గుండె వ్రీలి పోవు నిట్టిచిత్రములు వ్రాయించుటయా? స్వభావానురూపమైన కార్యకలాపముల కిదియా తార్కాణము.

తే. మందభాగ్యుఁడ! యవివేకి! మత్తుఁడా! వి
భగ్నహృదయుఁడ! ధూర్తుఁడా! భ్రష్టచరిత!
కాచుకొనుమింక నోరి సంక్రందనుండ!
విలయమొనరించు నిన్ను మద్విశిఖవృష్టి.

[అని ధనువాస్ఫాలించుచు నడుచుచున్నాఁడు]

[తెరలో]

దనుజవీరులారా! శాంతింపుఁడు శాంతింపుఁడు. భగవానునిచే ననుజ్ఞాతములైన తొల్లింటి వరప్రభావ విశేషములు సర్వథా మాననీయములు.

విద్యు:—(చూచి ధిక్కారముగా) అహో! మేఘనిర్ఘోషము!

భటు:—దేవా! అటులుకాదు.

విద్యు:—ఎవఁడీ ట్లుద్ఘాటించునది?

భటు:—(మీఁదుఁజూచి) నారదుఁడు; అల్లదే యటుపోవు చున్నాఁడు.

విద్యు:—(కోపముతో) నారదుఁడు! నీరదుఁడు! ఎవఁడైన నేమి? యుపక్రమణిక జరుపవలసినదే!

భటు:—దేవా! మహేంద్రుని రథధ్వానము కర్ణగోచర మగుచున్నదిటు—

విద్యు:— కానిమ్ము; ఆదెసకే మనము (నిష్క్రమించును.)

భటు:— (కంచుకింజూచి) ఓయీ! కదలమెదల లేక కొయ్య బొమ్మవలె నున్నావేమి; తలదిమ్మపట్టినదా నీకు? నీయొద్ద నింకేమైనఁ బ్రణయలేఖలున్నఁ జూపుము. (అని పరిశోధించి నిరుత్సాహముగా) దరిద్రుఁడా! నీవీమర్యాదతో నింక నడు.

(నిష్క్రమింతురు.)

[తెరపడును.]

---

## 3 వ, దృశ్యము.

---

(ప్రదేశము — తారకాక్షుని మందిరము.)

[ప్రవేశము:— శుక్రుఁడు, తారకాక్షుఁడు, కమలాక్షుఁడు.]

శుక్రు:— (తారకాక్ష, కమలాక్షులతో) వలదు వలదు. ఆతఁడు వచించినదంతయు ధర్మబాహ్యమైన యవినీతిప్రసంగము. దానిపొంతకు మీరు పోరాదు. ఒక్కవిషయముఁ జూడుఁడు, మీరాతని యాశ్రమమున నడుగిడినతోడనే మయప్రసాదితమగు నమృతకాసమంతయు నశించినదికదా! మీరాతని బోధలకున్న నింక ననేక దుర్దశలపాలై పతితులగుదురు. ఎదుటనున్న విషయముఁగూడ గ్రహింపనేరక త్వరపడుదురేని మీవంటి మందప్రజ్ఞులు లోకమునఁగలుగరు. ఆనాఁడు బ్రహ్మదేవుఁడును, మయుఁడును మీకేమి తెల్పిరి? సర్వసమాదరణీయములగు సదుద్యమములన్నియు మీకు వెగటయ్యెనా? నేను మీయందలి వాత్సల్యంబు పెంపున సమాదరించి యింతగాఁ దెల్పుట మీకుఁ జేదుమేపుటకా? పాపపుణ్యము లెఱుంగక యూరక పరిభ్రమింతురేల?

[అప్పుడు మాయామయుఁడు ప్రవేశించుచున్నాఁడు]

మాయా:—ఓహో! దైత్యపుంగవులారా! వినుఁడు వినుఁడు.

"సీ. సురఁ ద్రావుచుండు మీగురుఁడు భార్గవమౌని
పాలుఁ జే నరకకూపమున మునిఁగెఁ ?
జలపట్టి యధ్వరాశ్వములఁ దొంగిలిపోవు
వాసవుం డేరౌరవమునఁ గూలె ?
నేకర్మములు లేక యిచ్ఛగా విహరించు
సనకాదు లెట్టి యాతనలఁబడిరి ?
బలవంతమున గురుకులకాంతఁ బట్టిన
వనజారి యేదోష మనుభవించె ?

తే. బళిర! వారికి లేనిపాపములు మనకె
గలిగెనే తనయుక్తిని గదయుటన్నఁ
గాయమెడలిన మోక్షంబుగాక, మఱి శ
రీర మేడది సుకృత దుష్కృతము లేవి ?"

తార-కమ:—(లేచి కూర్చుండఁబెట్టుదురు.)

శుక్ర:—(చెవులుమూసికొని) హా! దుస్స్మరణీయము! ఔరా! యేమి నీయపూర్వబుద్ధికుశలత! నీ విమర్శనజ్ఞానమింత మనోహరరూపమును దాల్చినదా? లోకమున యుక్తాయుక్త విచక్షణత సుంతయు లేకపోవునా? ప్రపంచమంతయుఁ బశుతుల్యమయ్యెనా? దీనికి నేనేమి బదులొసఁగి యేమిప్రయోజనము? ఓయీ! నీవిట్టి దుర్మార్గమును బ్రకటించుటకేనా వీరిసాహచర్యముఁ గూర్చుకొంటివి? తారకాక్ష కమలాక్షులారా! మీబుద్ధిపాటవమును సర్వతోముఖముగ వినియోగించి యర్థశూన్యములైన వీనిమాటలను నిరాకరింపుఁడు.

మాయా:—(నవ్వుచు) అకించనుఁడా! త్రిపురదైత్యుల గురుఁడనైతినని గర్వోద్రిక్తుఁడవై విఱ్ఱవీగుచుఁ బనికిమాలిన వ్యర్థ భాషణములతోఁ గాలయాపన మొనర్తువే కాని, నీవు వారి మాన

పోద్రేకమును, స్వాతంత్ర్యవాంఛను నరికట్టి యెంతవఱకుఁ దగుదు ననిపించుకొందువు ? ఇది నీయాచార్యధర్మమునకుఁ దగనికార్యము కావున, నీకెన్నియేని పరాభవములు జరుగుచునేయున్నవి. నీయుద్దేశమంతయు శతధా నింద్యము; నిరాధారము,

“ సీ. స్నానంబువలన మోక్షంబుగల్గిన, నీరు
కాకికి మోక్షంబు గలుగవలదె ?
కాక, ధ్యానమున మోక్షము గల్గినను దటా
కము బకంబులకును గలుగవలదె ?
ముక్తి ప్రదక్షిణంబులఁ గల్గునన్నను
గాకి గ్రద్దలకును గలుగవలదె ?
పుడమిఁ బశ్వాలంబమున స్వర్గమన్నను
బలలభుక్కులకెల్లఁ గలుగవలదె ?
తే. కాననస్థితి బోయకుఁ గలుగవలదె ?
బిలములందున్నఁగలదె గబ్బిలములకును
గానమొందున్న మోక్షంబు గానరాదు
క్షణికవిజ్ఞానమునదె మోక్షంబుగల్గు. ”

ఇదియంతయు నామతసిద్ధాంతము. ఇందునుగూర్చి నీవు నాతోఁ బ్రతిఘటింతువేని కానిమ్ము; నీ కార్యగుణాకళంకమును రూపుమాపుదును. (అని నెమిలిపింఛముతో నంతటవిసరును.)

శుక్ర:—ఔరా! దుర్విధి దుశ్చేష్టితము! మరియాద నతిక్రమించి నడుచువారితోఁ బ్రసంగించుటయుఁగూడ దూష్యమే; ఛీ! ఇంత కర్ణకఠోరముగ నొనరించిన దైవదూషణము శ్రేయఃకాములనోటనుండి రాఁదగినదికాదు. (నిష్క్రమించుచున్నాఁడు)

తార-కచు:—(ఆశ్చర్యముతోఁ జూచుచుందురు.)

మాయా:—ఇట్టిమిథ్యాలాపములచే జగద్వంచనముసేయు దుష్పండితుల నింకఁజేరనీయకుఁడు. ప్రపంచమంతయు మీయాజ్ఞచేత

నుంచుకొనుఁడు. అత్యద్భుత యుద్ధవ్యాపారులకు-వీరప్రకాండులకు మీకుఁ బ్రపంచమున నాచరణీయం బెయ్యది? యనాచరణీయం బెయ్యది? శౌర్యానురక్తితో దిక్పాలక సమేతముగా జగత్త్రయం బాక్రమించి, స్వేచ్ఛావిహారము జరుపుచున్న మీకు-నైతికధర్మములు, అగోచరవిషయ ప్రకటనములు సాయపడి యుద్ధరింపఁ జాలవు. పరాక్రమింపుడీఁక వైకుంఠునిమీఁదికి, శంకరునిమీఁదికి, దిక్పాలకులమీఁదికి, జనసముదాయముమీఁదికి, సమస్తలోకముల మీఁదికి—మహోజ్జ్వలమైన వీరచారిత్రపద్ధతి కనుసరణీయమైన దంతయు మీరే నిర్ణయించుకొనుఁడు. పగతులనందఱ సాధించుకొనుటకై మీకింక సమయమెప్పుడు చిక్కును? భోగానుభవములకుఁ గాలమెప్పుడువచ్చును?

తారకము:—(తలయూఁచి) మీరు చెప్పినదంతయు సహేతుకముగానున్నది. మీమతమును సంపూర్ణముగా నవలంబించితిమి.

మాయా:—అటులైన జయజయధ్వానములతో నామతమంతయు మీపురములయందు నవ్యాహతముగఁ బర్వ్యాప్తి నొందఁ దగునుకదా!

తారకము:—నిస్సంశయము. మాయామయునకు జే.

(నిష్క్రమింతురు.)

[యవనికపడును.]

ఇది చతుర్థాంకము.

## త్రిపుర విజయము.

(ప్రదేశము—ఉద్యానవనప్రాంతము.)

[అప్పుడు ఒకానొక వృద్ధకంచుకి ప్రవేశించుచున్నాఁడు]

కంచు:—(రావిచెట్టుక్రిందఁ గూర్చుండి) అబ్బా! ఎంత కష్టము! మా రాజకాంతలు నన్నుఁ బీడించుచున్నారే! ఎల్లకాలము నీరావిచెట్టుక్రిందనే కూర్చుండి జాగ్రత్తతో నుండవలెనఁట! ఈ మహావృక్షమును వారు కౌఁగిలించుకొందురఁట! హౌరా! ఇదేమివింత! సంతానముకొఱకై గౌరీపూజలొనర్చి యనేకములగు సత్కార్యములాచరించుచుఁ బూతచారిత్రలై సద్ధర్మనిరతలగు మా రాజదేవేరుల నిశ్శంకతో మోసగించి దురుపదేశములొనర్చుచున్న వారీ యకార్యకరణంబున కియ్యకొందురా? ఇది మా ప్రభువులకుఁ దెలిసియుండునా; తెలిసియున్న నిట్టి దుర్వ్యవహారమునకు వారు సహింతురా? (వినుటనభినయించి) ఆఁ, యేమనుచున్నారు? "రాజకాంతలు రావిచెట్టును కౌఁగిలించుకొని యందున్న మహాపురుషునితో రాసక్రీడలు సలుప నరుదెంతురని యా? హౌరా! ఆ మహాపతివ్రతల నిట్లు వంచింపఁజేసినవాఁడెవఁడు? (యోజించి) ఆహా! భగవంతుఁడనగు నారాయణుఁడా! నీమహిమ లద్భుతములు కదా! అనంతయుగములనుండి, యనంతలీలలఁ బ్రదర్శించి యనంతుఁడవైన నీవే యిట్టిపనికిఁ బూనుకొన్న నింకేమున్నది దేవా! (నిట్టూర్చి) అకటా! త్రిపురదైత్యవినాశమునకై వలయు నుపాయములన్నియు నీవే పన్నుచుంటివా? దేవా! రక్షింపుము. (అప్పుడు రావిచెట్టునుండి విష్ణుదేవుఁడు ప్రత్యక్షమగును. కంచుకి మూర్ఛిల్లును.)

ఇది విష్కంభము.

---

శ్రీ

# త్రిపుర విజయము.



## పంచమాంకము.



### ౧వ, దృశ్యము.

---

(ప్రదేశము—కైలాసపర్వతము.)

[ప్రవేశము:—ఈశ్వరుఁడు, నారదుఁడు]

ఈశ్వ:—(నారదునితో) ఏదేని మహాత్కారణముండినఁగాని మహర్షులూరక రారు.

నార:—దేవా! దుష్ప్రాపణీయంబగు నీసందర్శనమునకుఁ గూడ కారణముండవలయునా? అయినను సంకల్ప పరంపరాభ్యాసముచే నన్నావరించియున్న యొకానొక చిత్తవిభ్రాంతికి దివ్యౌషధము నాకు సేవనీయమైనది. అద్దానిని దేవర యనుగ్రహింపఁ దగుదురని యింతదవ్వు రావలసివచ్చినది.

ఈశ్వ:—ప్రాపంచిక విషయములన్నియు నీకుఁజేయందు నిడుకొని యన్యుల నేమి యాచింతువు? అంతశీఘ్రముగ నీకిపుడు కావలసినదేమి?

నార:—దేవా! నాకిపుడు కావలసినదొక సంశయనివృత్తి మాత్రమే; అదేమన; ధర్మవిద్వేషులు, లోకవిప్లావకులు నగు పాపాత్ములు కఠోరకదన క్రీడలొనర్చి విజృంభించుటవలనఁ బ్రపంచమంతయును మగ్గిపోవుచుండఁగా దీని ననునయించువారెవరా యని—

ఈశ్వ:—ఉచితరీతిగనే నన్నడిగితివి. అయిన నీప్రశ్నంబును గూర్చి నేనింకను యోజింపవలసియే యున్నది.

నార:—దేవా! అట్లైన రోగశాంతికిఁ జికిత్స యవసరమే లేదనుఁడు.

ఈశ్వ:—లేకయేమి? అయ్యది పక్వదశకు రావలయును.

నార:—నిఖిల చరాచరంబులకు నావిర్భావ తిరోభావంబులు కల్పించు ప్రభుఁడవు. నీవు పేర్కొంతువేని గుణపాఠముఁ జెప్పునదెవరు?

ఈశ్వ:—కాలము.

నార:—నీవు కాలస్వరూపుఁడవుకదా! కర్తవ్యధర్మము నెప్పుఁడు పాటింతువాయని భువనమంతయు వాంఛాదృష్టులతో నీదెసఁ బరికించుచున్నది.

ఈశ్వ:—నారదా! నీప్రశ్నమునకుఁ బదపడి ప్రత్యుత్తరముఁ జెప్పెద. అదిగో! మా భృంగి యెక్కడినుండియో తొందరగా నిటువచ్చుచున్నాఁడు. ఆయన వేగిరపాటుఁగూర్చి ముందుగా నడిగి తెలిసికొందము.

[అప్పుడు భృంగిరిటుఁడు ప్రవేశించును.]

భృంగి:—(ఆత్రముతో) దేవా! ఏమిచెప్పుదును? భూమ్యాకాశముల నువ్వెత్తుగఁ గబళించుచున్న యాభయంకరాగ్ని జ్వాలల నొక్కసారి శిఖరాగ్రమున కేఁగిచూడుఁడు.

ఈశ్వ:—(చూచి) ఇది యెందువలనఁ గల్గినది?

భృంగి:—ఇదియంతయు నిస్సంశయముగాఁ ద్రిపురదైత్యుల క్రూరకృత్యము. యుక్తాయుక్తము లెఱుంగని లఘుస్వభావులైయా రాక్షసులు జగత్త్రయంబు నాక్రమింపఁదలఁచి తమపురంబులతో నెవలి యగ్ని జ్వాలలు వెదఁజల్లుచున్నారు. దీనిని వారించుటకై దేవర నన్నునియమింతురేనిఁ గృతకృత్యుఁడనయ్యెద.

నార:—భృంగీ! దర్శనమాత్రముచేఁ గలగుండువడు హృదయమునకుఁ గార్యమువట్ల జాగరూకత కల్గునుకొంటివా?

భృంగి:—అటులననేల ? జాగరూకులు సర్వకార్యములం దును నప్రమత్తులే,

నార:—సరియే, నీకిది సామాన్యకార్యముగాఁ దోఁచినది కాఁబోలు ?

భృంగి:—కాకేమి ? అటులైనఁ ద్రిపురవధోద్యోగంబు దుస్సాధంబనియా ? నారదా ! ఇవి యేటిమాటలు ? మమ్మెట్లు తలంచితివి. గతించిన మహాసంగ్రామములలో నేను బ్రకటించిన యద్భుత సాహసకార్యములు నీవు తలఁపుగొనక యమాయికముగ మాటలాడుచుంటివి. (ఈశ్వరునితో) దేవా !

ఉ. పెక్కులు బల్కనేల పటుభీకరవృత్తినిఁ బూని యాజిలో
రక్కసిమూకలం దునిమి రంహమునన్ జనుదేరువాఁడ, న
న్నొక్కనిఁ బంపు సంశయము నొందక తద్విధమొల్లఁదీర్చి నిన్
మొక్కిననాఁడె మెచ్చుచుఁ బ్రమోదముఁగూర్చును మాటలేటికిన్.

ఈశ్వ:—(తలయూఁచును)

నార:—బాగు బాగు, భృంగిరిటుఁడా కొనియాడఁదగినవే నీ ధైర్యసాహసములు ! దొడ్డవాఁడవే నయ్యా దొడ్డవాఁడవు !

భృంగి:—కాకయేమి ? మునిముచ్చుల కెల్లపుడు సంశయాత్మకపు టూహాలే.

నార:—(పరిహాసముగ) భృంగీ ! నీవుచాల తెంపరివి. విశేషించి బలపరాక్రమ సంపన్నుఁడవు. నీవలననేకదా యీమహానుభావున కింతప్రతిష్ఠ ! మెచ్చుకొనుచుంటినయ్యా నిన్ను మెచ్చుకొనుచుంటిని.

తే. మాటకారివి, త్యాగివి, పోటుబంటు,
పలికి పలికించుకొనుటకు భయములేదు
ముద్దుబిడ్డఁడవౌదు వాపెద్దదొరకు
పాదదాసులు నీకుఁ బ్రపంచజనులు.

ఈశ్వ:—(సస్మితముగ) సంభావింపుము నారదా, మా భృంగిని సంభావింపుము.

నార:—సంభావనమే కాదు; అంతకంటె నధికముగాఁ జేయవలసిన దే; (భృంగితో) ప్రభుమన్ననకుఁ బాత్రుండవై యితోధికముగా వర్థిల్లుము.

భృంగి:—ఇప్పుడు మాకేమి కొఱవడినదని ?

నార:—(ఆత్మగతము) అహో ! ఆశ్రియబలము వివేచన జ్ఞానమునుగూడ మఱపించుచున్న దే !

తే. కడవలకొలంది నేరముల్ కప్పిపుచ్చుఁ
బలుకు ప్రల్లదములుఁగూడ విలువఁదెచ్చు
ముందువెనుకలఁ గలజనుల్ మందమతులు
ఔర! యాశ్రియబలము మహాద్భుతంబు.

సరియే; ఈతనిఁ గొంచె మూపిచూడు మనునట్లుగా నీశ్వరుని తాటస్థ్యవిధానము; ఓహో ! ఉత్సాహవేళలయందుఁ బ్రభువుల క్రీడా కాలయాపనము కదా ! కానిమ్ము, పర్యవసానముఁ ద్వరలోఁ దేల్చుకొన యత్నింతును. (ప్రకాశముగా) దేవా ! ఇతఁడు ప్రభావశాలి; యుక్తిపరుఁడు; కార్యనిర్వాహణదక్షుండు; లోకమునంగల గొప్పగొప్ప సమస్యలన్నియును నొక్కమాటతోఁ బరిష్కరించి రాఁగలడు. కావునఁ గొంచెము విడిచిపెట్టిచూచుఁడు లోకమునకు రెండువిధములు మేలు.

భృంగి:—నారదా ! పరిహాసోక్తుల కిదియా సమయము ?

నార:—నేను నీవంటి సమయజ్ఞుఁడనుగాను, ఇది పరిహాస వాక్యమును గాదు. నిజముగనే యనుచుంటిని. (మందలించి) భృంగీ ! దుష్టసంహరకార్యములు పరిహాసముతోఁ దీరిపోవునా ?

భృంగి:—అటులెన్నఁడును జరుగవు.

నార:—తియ్యనిమాటలతో ?

భృంగి:—మాటలతోఁ గాదు. శూలపుఁ బోటులతో-

నార:—అటులునుగాదు, ఏమందువా ?

ఉ. పరమతపఃప్రభావమున భాసిలి, బ్రహ్మనుగొల్చి వానిచే
వరము లనేకముల్ గొనినవారి నలంతులుగాఁ దలంచితే

దురమునఁ జేటువాటిలదె తొందరనొందిన లాభమున్నదే
గరువపుమాట లేమిటి కికన్ గ్రియలే యొనరించువారికిన్.

[నేపథ్యమున]

దేవా ! రక్షింపుము రక్షింపుము.

తే. నాఁడు హాలాహలము భక్షణం బొనర్చి
భువనముల్ రక్షచేసిన పుణ్యమూర్తి!
నేఁడు పురదైత్యుల నడంచి నిర్జరాళి
భయముఁ నుడుపవె సత్కీర్తి బడయరాదె !.

అందఱు:—(ఆకర్ణింతురు)

ఈశ్వ:—ఎవ్వరిదీ యార్తస్వనము ?

భృంగి.—(చూచి) దేవా ! అదే మహేంద్రుఁడు; కతిపయ నిలింప పరివృతుఁడై యిటు వచ్చుచున్నాఁడు.

[అప్పుడు ఇంద్రుఁడు, బృహస్పతి మున్నగువారు ప్రవేశింతురు.]

ఇంద్ర:—దేవా ! రక్షింపుము రక్షింపుము.

తే. కాలకూటము మ్రింగిన ఘనుఁడ వీవు
గండధారిని దండించి తనరితీవు
త్రిపురదైత్యుల యలజడిఁ దీర్పుమయ్య !
పరమకరుణాలవాల ! సంభావ్యశీల !

ఈశ్వ:—ఆశ్చర్య మాశ్చర్యము. మీకింకను దైత్యులబాధలు తప్పకుండెనా ? శాంతింపుఁడు.

బృహ:—దేవా ! ఇం కెక్కడిశాంతి;

సీ. సకల బృందారక సందోహసౌఖ్యద
మమరావతియె శూన్యమైన దిపుడు
నానావిధఫలాళి నానందమునుగూర్చు
నా నందనము కళాహీనమయ్యె
యక్ష కిన్నరముఖ్యు లతిదీనవదనులై
వననివాసములకుఁ జనిరి నేఁడు

ప్రాజ్యసామ్రాజ్యవైభవధురంధరుఁడైన
పాకశాసనునకు భయము కలిగె
ఆ. లోకజాలమెల్లఁ గాకోలమయమైన
నాఁటి యనుభవములు నేఁటికయ్యె
నేమిసేయఁదగు మఱేమిసేయఁగరాదొ
యేర్పరింపు మభవ! యిద్ధచరిత!.

నార:—(జనాంతికముగా) ఇది గోవ్యాఘ్రకలహము; ధర్మాధర్మములకు సంగ్రామము. దీనిని బరిష్కరింపుటకుఁ బ్రార్థించెడువారు మహేంద్రాది బృందారకులు. ప్రార్థనీయుఁడు సకలలోక క్షేమంకరుండగు శంకరుఁడు. విషయము భువన భయంకరము. ఇదెట్లు పరిణమించునది వితర్కింపఁ దగియున్నది.

ఈశ్వ:—(సకరుణము) మహేంద్రాది బృందారకులారా! ప్రేమార్ద్రములు గావించు మీదీనాలాపములకు ముగ్ధుఁడ నగుచున్నాను. త్రిపురదైత్యులు ప్రచండవిక్రములు. విశేషించి వర ప్రభావ సంపన్నులు. వారు తపప్రాతిశయముచేతఁ, బాహుబలాధిక్యముచేత, సాంగ్రామిక వ్యాపారము లోనర్చి జగత్త్రయం బాక్రమింపనుండిరి. కావుననే వారి దృక్పథమునుండి మీయట్టివారు తప్పించుకొనఁజాలకున్నారు.

ఇంద్ర:—దేవా! హృదయ సంక్షోభమును భరించుకొనఁజాలక మేమిట్లు ప్రార్థించితిమి, అవిచారిత మతులము. మేఘము లేని పిడుగువలె నాకస్మికముగ నిట్టిప్రళయము సంభవించుట యెందైనఁ గంటిమే; ఇంకమే మెందుఁ బోఁగల్గుదుము?

ఈశ్వ:—ఇది పితామహుని యవివేకము. త్రైలోక్యమాననీయంబై వెలుఁగొందుచున్న యాతనిప్రతిష్ఠకిది కళంకము. జరిగిన కార్యమున కింక వగవఁబని లేదు. నిరూఢమగు ధర్మవిప్లవ సమయమందుఁ బూర్వానుభూతములగు మీ యనుభవములు స్మరించుకొని యించుక యూఱటఁజెందుఁడు.

బృహ:—దేవా! అపరాధములు మన్నించి మాప్రార్థన మంగీకరింపుము. నీ యభయహస్తమే నేఁడు కనుమూసి కాటియ వడుచున్న యీ విశాలప్రపంచమున కాశాజ్యోతియై నవ్యోత్సాహముఁ బ్రసాదించుఁగాక!

ఈశ్వ:—(చింతించి) వైకుంఠుఁ డిపుడు త్రిపురధర్మవిచ్యుతికై యెనలేని ప్రయత్నములొనర్చి వారి వినాశమును సులభోపాయముగఁ గూర్చుచున్నాఁడు. అతఁడు నాప్రభావమున కనుగుణముగా సర్వశక్తులనొసంగి త్రిపురవధోద్యోగము నాచే జరిపించి పురధ్వంసి బిరుదము నాకు సమర్పింపనున్నాఁడు. కావున బెగడొందకుఁడు.

నార:—దేవా! త్రిపురదైత్యులు నిరంకుశ పరాక్రమకళా విశారదులు. సాహంకారులు.

[తెరలో]

దేవా! నారాయణుని యాజ్ఞచొప్పునఁ దగినరథంబును దత్తత్సాధనంబులును నిర్మింపఁబడినవి. ఇంకఁ దమదే యాలస్యము.

ఈశ్వ:—(చూచి) ఓహో! ఇది విశ్వకర్మవాక్యము. మంచిది, లోకమంతయు నన్నిట్లు ప్రేరేచుచుండ నింక నట్టి దుర్నయనిర్వాహకబీజములు ప్రపంచమున నుండఁగూడదు. దేవతలారా! విచారింపకుఁడు. ఆదైత్యాధములు తత్క్షణమే నాచేత వధ్యులయ్యెదరు.

శా. ఆకాశంబున కేగినన్ జలధిమధ్యంబందునన్ డాఁగినన్
వీఁకన్ శైలగుహాప్రదేశముల నన్వేషించి పోఁబోయినన్
ప్తోకంబైనను జింతసేయక రణక్షోణిన్ విడంబించి ని
శ్శేషుల్ గా నొనరించి కూల్చెద జయశ్రీలబ్ధికై దైత్యులన్.

బృహ:—లోకవంద్యా! నిరుపమాన తేజోరాశివి. ఈ త్రైలోక్యమును సృజియించి పాలియింప సమర్థుఁడవు. మాప్రత్యర్థులందఱు ధర్మబాహ్యులు, దుర్వినీతులుగాన నీకు శత్రువులు.

నార:—దేవా! అజాది దుర్లభమగు నీప్రభావమును వర్ణించుటయం దస్మదాదులకు శరణ్యము మౌనముద్రయే;
( అనుబంధము గీ )
(అందఱు నిష్క్రమింతురు.)
[ తెర పడును. ]

---

## ౨వ, దృశ్యము.

---

(ప్రదేశము—రహస్యమందిరము.)
(ప్రవేశము:—మయుఁడు, విద్యున్మాలి, తారకాక్షుఁడు.)

మయు:—మాయామయుని దురుపదేశములు మీకుఁ దల కెక్కినవి. ఆచార్యుని సైతము నిందించి ఘోరపాతకము నొడిఁ గట్టికొంటిరి. ఇవియా మీ వరణీయగుణములు! ఆహా! ఇంత వివేకహీనులై, పతితులై, నీచాతినీచ దుష్కార్య సంకట లంపటులై యాడలు తెలియక యెవ్వారైనఁ బ్రవర్తింతురే! త్రినేత్రుఁడు త్రిశూలపాణియు నగు పరమేశ్వరునియందు సైతము మీకు ద్వేష బుద్ధియా? చెవి నిల్లుకట్టుకొని మీకుఁ దెలిపినదంతయు త్రోసిరాజు చేసితిరి. ఔరా! మీ రెంతమూర్ఖులు!

విద్యు:—మహాత్మా! ఇదియంతయు నప్రస్తుతము.

తార:—అననుకూలము.

మయు:—ఇహీఁ! చెడిపోయినవారి కీలోకమంతయునట్టిదే.

తార:—ఏమీ, యిది నిశ్చయముగ మీ మాటయేనా?

మయు:—కాకయేమి? లోకకంటకు లిహపరదూరులుకదా!

విద్యు:—ఇది మీరనినట్లు కాదు; శత్రుసంహారము జరిపిన పిదప శాంతిసందేశము లోకమున కందఁజేయుదుము.

మయు:—ఓహోహో! మీరు శత్రుసంహార కార్యమొనర్చుటయు, లోకములకు శాంతిసందేశమునా? ఇపుడు మీ శత్రుత్వ

మును బరిమార్చుటకై లోకమంతయుఁ ద్వరపడుచుండ మీరేమి సేయుదురు ?

తార:—ప్రతిఘటింతుము.

మయు:—ప్రతిఘటనలు; మఱి,

విద్యు:—దేవా ! అటులనెద రేల ?

చ. అగణిత సర్వసంపదల నందఁగఁ గల్గితి మిన్నినాఁడు లే
దిగులును బొందకుండ భవదీయకృపారసవీక్షణంబునన్,
బగతుర మేము కాము, నినుఁ బ్రస్తుతిసేయుచునుంటి, మీగతిం
దెగడఁగనేల యేలఁగదె దివ్యసుఖం బొనగూర్చి క్రమ్మఱన్.

మయు:—నేనుమీతో మాటలాడుటకే లజ్జించుచున్నాను. నాచేయనెంచిన సాహాయ్యమంతయు నింతకుఁ బూర్వమే యైనది. అది చిరస్మరణీయమగు విషయమయ్యును దుష్పరిణామమగుటచేఁ బశ్చాత్తాపము తీరకున్నది. అనుగ్రహపాత్రులగుటకు మారుగ నాగ్రహపాత్రులైతి రీశ్వరునకు; అలోకసామాన్య తేజోవిరాజితుఁ డగు నాతఁడు మీ జీవనకుసుమములకుఁ బ్రళయము కల్గింపక మానఁడు. ఇది యనివారితము. ఇఁక మీ విప్రియోక్తులు చాలిం పుఁడు.

శా. సైరింపంబనిలేదు దుర్మదచమూసంహారకుం డుగ్రుఁడే
ధీరత్వంబున వచ్చి నిల్చునెడ మీ తేజంబు గిజంబునున్
సారాపేతమగుం బోరింబోరి మిమున్ జాకుండఁ బోనిచ్చునే
ఘోరంబైన తదీయబాణదహనాకుంఠీభవజ్జ్వాలలన్.

విద్యు:—(కోపముతో) అయ్యా, యేమనుచున్నారు; ఈశ్వరుఁడే యెత్తివచ్చిన నేమయ్యె ? నిశ్చయముగ లబ్ధవిజయులము.

మయు:—(తలయూఁచి) పిచ్చికూఁతలు;

తార:—ఏమేమీ, ఈశ్వరుఁడే వయనింపనున్నాఁడా దంతయాత్రికు ? అటులైనఁ గొండలు, బండలుఁ వెతకనక్కఱ యేమి ? యెంత తేజోవంతుఁడు ! పులితోలుగప్పుకొని మమ్ము బెదరింప

నున్నాఁడేమో! అతఁడు త్రినేత్రుఁడట, త్రిశూలపాణియు నఁట! యెవ్వఁడైననేమి? రణక్షోణియందు నిర్భీకుఁడై, యెదుటనిలిచి నాభుజదర్పము చవిచూడవలయును.

విద్యు:—(పరిహాసముగా) ఈశ్వరుని హృదయము నవనీత కోమలము, దృష్టియంతయు విషమమే; తనకుఁదానే శత్రువు. పోనిండు, యీ వేషబములతో మీకును మాకునుఁ గాలహరణమే,

మయు:—కాలహరణమే యగును? (అని లేచి జనాంతికముగా) ఆహా! సుగుణసంపత్తిచే నతిశయింతురని యునకార మొనర్ప నిదికదా ఫలితము.

కం. గుణుల కొనర్చెడిసాయం
బణువైనం బరిణమించు నధికంబుగ, దు
ర్గుణుల కది మోతచేసిన
గణుతింపఁగరాదు గుర్విడిగవ్వకునేనిన్.

[తెరలోఁ గలకలాసంశరము]

అందఱు:—(తిలకింతురు)

మయు:—చూచితిరా, అయుత సూర్యప్రభాయుతమైన దివ్యరథము. అదిగో పతాకము; మాయురే! రణోచిత వేషధారులై వజ్రత్రిశూల గదా ఖడ్గాది ప్రహరణంబులు ధరించి యెంత మందియోధులు వచ్చుచున్నారు? అద్దిరా! హృదయ చాంచల్యము, కన్నులఱు మోడ్పులు—ఆహా! జగత్ప్రళయము! (ఈశ్వరునుద్దేశించి)

చ. దురితముసేయలేదు; నిను దూఱఁగలేదు వివేకహీనతన్,
సురలకునైన నెగ్గు పొడసూపఁగలే దుపకార మీక్రియం
బరిణతిఁ జెందె, నాదయిన పాపము నీవె శమింపఁగాఁదగున్
వరకరుణాలవాల! మునివందిత సద్గుణజాల! యీశ్వరా!.

తార:—అయ్యా! మ మ్మింతకంటె మూర్ఖులుగాఁ జేయకుఁడు.

తే. విసపుఁగుత్తుకవాఁడఁట వేలుపంట
మూఁడుకన్నులవాఁడఁట పోఁడయంట
మమ్ములను గిన్కమై నుఱుమాడునంట
చేవచవి యించుకంత చూచెదముగాక!

మయు:—(కోపముతో) ఓయీ, యేమేమో యనుచుంటివి. అనన్యసామాన్య మహిమాన్వితుఁడు పరమేశ్వరుఁడు.

ఉ. చిచ్చుఱకంటివేల్పు రణసీమను మిమ్ము వెలార్ప నేఁ డిదే
వచ్చుచునున్నవాఁడు, గరువం బిఁకఁ జెల్లదు, పద్మసంభవుం
డిచ్చినయట్టి యా వరము లేవియుఁ జెల్లవు, మృత్యువీవిధిన్
వచ్చె మిమున్ వధింపఁగ నవశ్యము నావచనంబు నమ్ముఁడీ.

రథము సమీపించినది. ఇఁక ముసలకుఁడు, పరమేశ్వరు నాకృతి విశేషముఁ జూచియైన మరలిపోఁడు.

మ. కుటిలభ్రూకుటిదుర్నిరీక్ష్యుఁడగుచుం గోదండమౌర్వీలతా
చటులధ్వానము లాకసంబు నొరయన్ జంచద్రథాంగాహుఁడై
పటురంహంబునఁ గాలకాలునికి రయన్ భాస్వత్ప్రభావాఢ్యుఁడై
నిటలాక్షుం డిదె వచ్చెడిన్ నిజబలానీకంబుతో నుగ్రతన్.

తార:—(చూచి) ఇఁకఁ గాలవిళంబనముతోఁ బని లేదు. రణోచిత వేషములతో మనము సిద్ధముగ నుండవలయును.

విద్యు:—అటులే;

మయు:—దేవా! అపరాధ మపరాధము. క్షమింపుము.

విద్యు, తార:—ఛీ! యిందెవ్వఁడు క్షమించువాఁడు లేఁడు.

[మయుఁ డొసఁగిన దివ్యచక్రము తిరుగుచుండుటమాని
ఆగిపోవుట కనిపించును.]

విద్యు, తార:—(చూచి పైకిమూఁపదీసి) ఋణము తీరిపోయె, ఇఁక బయలు దేఱుఁడు. (అని మయుని పైకి విసరివేయుచు, నిష్క్రమింతురు.)

మయు:—హా! దుస్సహము. కృతఘ్నులు, పతితులు. తండ్రిగుణముల ననుకరించుచున్న వీరును నిశ్చయముగ మరణార్హులు.

తే. అల్పమతులకు నుద్యోగ మబ్బు నేని
వారి నైసర్గికపుఁజింత వదలఁగలరె?
పరిమళద్రవ్యయుక్త సౌవర్ణపీఠి
నిడినఁ దనకంపు నీరుల్లి విడువఁగలదె?

(నిష్క్రమించును.)

[అప్పుడు కమలాక్షుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కమ:—(కోపముతో) ఓరీదురాత్మా! అసంబద్ధప్రలాపా!

శా. ఔరా! నోరికొలంది వాగెదు మదాంధా! తారకుండీల్గెనిం
కారీతిం దనపుత్రులయ్యెదరు ఘోరాజిస్థలంబందు నం
చోరీ ధూర్తుఁడ! కన్నుఁగానవా రిపువ్యూహంబు నాభీల దు
ర్వారాస్మద్భుజవిక్రమంబుననె చంపంజాలుదున్ జూడురా!

దుర్మతీ! తారకపుత్రుల నలంతులుగా భావించి భయముదక్కి ధన్యోస్మియని చంకలుగుద్దుకొనుచుంటివిగా! ఏమి నీ యవివేకము?

తే. ఎదుటఁగన్పడు విషయంబు నెఱిఁగికొనక
కాలు లఱవంగ సాగెదు కలుషచిత్త!
అనత పరిపంథి కంఠలుంఠనమునందు
వాసిఁగాంచిన నా కరవాల మిదిగో! (కత్తిం జూపును)

కపటాత్మా! నీవెవ్వఁడవైన నగుదువుగాక! ఇట్టి విపరీత వాగ్ధోరణి ననుసరించుకొని మామనంబులకు సంశయముఁ గూర్చుదువే! పూజ్యుఁడగు మాయామయుని నిందించి వదరితివే; ఆతనిప్రభావము నీవే మెఱుంగుదువు? మమ్ము వంచింపఁదలఁచి యాతఁడు కపట కృత్యము లెన్ని పన్నినఁ బన్ననిమ్ము. అనురాగవతులగు మాకాంత లెల్లరు మాయాజ్ఞల నుల్లంఘించి, స్వైరవిహారము లొనర్పనిమ్ము.

అమృతకూపముతో మాకిదివరకే పనితీరిపోయినది లే. ఇంక బితామహ దత్తవరంబులు నశించినమాకేమి? సమస్త శాత్రవసముదయ ప్రాణానిల కబళన సమర్థంబగు మదీయ భీషణ కృపాణవ్యాళ రాజంబుచే నొక్క మొగిఁ జుట్టుముట్టి యెల్లరం బొలియింపఁజాలకుందునే,

తే. కాలుఁడో కాలకాలుఁడో గర్వమూని
యెవ్వఁడే నెత్తివచ్చిన నేమిలెక్క ?
అస్మదీయ ప్రచండ బాహాప్రతాప
కీలికీలాభిదగ్ధుఁడై కీడుపడఁడె!.

[అప్పుడు ఒకానొకభటుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భటు:—దేవా ! దేవర సెలవిచ్చినట్లు సమస్త ప్రదేశములకుఁ జని శక్తివంచనలేక పరాక్రమించి వచ్చితిమి. మాప్రయత్నము సంపూర్ణముగాఁ గొనసాగినదని సంతోషముతో విన్నవించుచున్నాము. ఎక్కడనో కొంచెముగా సాహసించినట్టి ఘాతుక బ్రహ్మచారుల నెల్లరఁ గొట్టి కోలాహలముగావించితిమి. ఆయాయి ప్రజలపై, గ్రామములపై, పట్టణములపై, చిచ్చుఱ పిడుగులమై దాడి సల్పితిమి. నక్కనీతుల నుపదేశింపవచ్చిన లేఁతపొరకాయలను దలగిల్లి మొలవవేసితిమి. ఇంక నుపక్రమింప నవసరమున్న దేవర యానతి.

కమ:—ఓయీ ! అవసరము లేకయేమి ? యెప్పటికప్పుడే మనయిచ్ఛ ననుసరించి లోకములు మెలఁగుచుండవలయునుగదా ! ఇంతటితో సమరప్రయత్నములు విరమింపఁ బనిలేదు. కైలాసమున కేగి యచ్చటఁ గాపురమున్న మేఁకవన్నె పులులగు ప్రమథులనందఱ గడ్డిగఱచునట్లు చేయుఁడని మాయగ్రజులకు నామాటగాఁ దెల్పుము. నేను వైకుంఠమును ముట్టడించి విష్ణువుపైఁ బరాక్రమించుచున్నాను.

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

## 3వ, దృశ్యము.

ప్రదేశము—యుద్ధభూమి.

[ప్రవేశము—వీరభద్రుఁడు, భృంగిరిటుఁడు.]

భృంగి:(—వీరభద్రునింజూచి)ప్రమథగణములారా!మున్ముందుగా మీరుపోయి యాపురదైత్యుల మువ్వుర నొక్కచోటున సమావేశపఱిచి యెందునుబోనీయక జాగరూకులై యుండవలయు ననికదా పరమేశ్వరుఁ డానతిచ్చి మనలఁ బంపించెను. ఆమహానుభావుని యాజ్ఞాప్రకారము మనమిదే పోయి త్రిపురదైత్యులు సంచరించుమార్గము లన్వేషింపవలయును.

వీర—ఇదియంతయు వారు నివసించు ప్రదేశమే; కావున మనము మిక్కిలి జాగరూకులమై, వారొనర్చు మాయోపాయములకు లోనుగాక మెలఁగవలయును.

భృంగి:—నిజముగా నటులే, (పరిక్రమించి) వీరభద్రా! ఇటుచూడుము; నేఁడేమికారణమోకాని, యీయుద్ధక్షేత్రమును జూచుకొలఁది నామనస్సంతయుఁ బలుశోకలఁ బోవుచున్నది. ప్రకృతియంతయుఁ దన నైజవిలాసమును దిగంతములకు వ్యాపింపఁ జేసి భయంకరరూపముఁ దాల్చినది. (ఆకసమువంకఁ జూచి) ఓహో! ఇది ప్రపంచమునావరించిన మహాప్రళయమే కానోపును.

ఆ. స్వప్నసుఖములట్లు, జడుల సంపదరీతి,
జలధియూర్ములట్లు, తలఁపులవలె,
నంతలోనఁబొడమి యపుడె నశించు నీ
చంచలాలతికలఁ గాంచుమయ్య!.

వీర:—ఔను. ఇంతకుఁబూర్వమందు జరిగిన సంగ్రామము లన్నియు నొకయెత్తు నిదియొక్కటి యొకయెత్తు; ఏమన—

సీ. సర్వ సర్వంసహాచక్రంబె యరదంబు
రవిసుధాకరులు చక్రద్వయంబు

పాత్రఁజదువులు నాల్గు భవ్యతురంగముల్
చారుకోదండంబు మేరునగము
అమ్ములగీము మహోత్తర వారాశి
సారథి నిగమవిశారదుండు
ఆదిశేషుఁడె విచిత్రాకృతిఁదగునారి
యల విభుండుదు చోద్యంపుటలుఁగు
తే. తాను రథికుండుగాఁగఁ బ్రధానదృష్టి
త్రిపురనాశనహేతు సందీప్తి మెఱయఁ
బ్రళయతాండవమొనరించి భయదవృత్తి
రుద్రుఁడొప్పారుచుండె నిర్నిద్రుఁడగుచు.

[అప్పుడు విద్యున్మాలి ప్రవేశించుచున్నాఁడు.]

విద్యు:—(కోపముతో) ఓరీ! వాచాటా!

ఉ. రుద్రుఁడెయైననేమి యమరుల్ పటువిక్రములైననేమి ని
ర్నిద్రపరాక్రమంబున నరిప్రకరంబుల రూపుమాపెదన్
రౌద్రమునూని యేను సమరక్షితిఁ బైకొని విక్రమించెదన్
మద్రణకౌశలంబునకు మార్కొనడ లోకములం గలంచెదన్.

మూర్ఖులారా! ఏల వెఱ్ఱివీగి మాటలాడుచున్నారు? అగ్నిజ్వాల కంటెను, అశనిపాతముకంటెను, తీక్ష్ణమై - దుస్సహమైన మా యుజ్జ్వలప్రతాపమును గన్నుతెఱచి చూడరైతిరా?

భృంగి:—ఓయీ! సర్వవిషయంబుల మాప్రభువునకు మీకును హస్తిమశకాంతరము. ఆతని మాహాత్మ్య మించుకంతయు నెఱుంగక మదమద్యపాన నిరతులై యాడలు తెలియక జల్పవాక్యము లాడుచున్నారు. అతఁ డిప్పుడేవచ్చి మిమ్ముఁ గృతాంతాలయమున కతిథులుగాఁ బంపును. కారణమడిగెద రేని వినుడు.

కం. కరుణాదూరులు హీనులు
దురిత ప్రవణాత్మకులును దుర్మదులు నిరం

తరసాధులోకబాధా
కరకృత్యులు వధ్యులగుచుఁ గాఱియపడరే!

[అప్పుడు తారకాక్షుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

తార:—వెఱ్ఱివాఁడా! యేమి వదరుచుంటివి? ఆకాశము విఱిగి నెత్తిపైఁబడినదనుము; కుందేటికిఁ గొమ్ములున్నవనుము.

మ. ఖలులంచున్ గిలులంచు నోరికొలఁదిన్ గర్వోక్తులేలా యిఁకం
బ్రిశయంబై, గ్రహతారకాయుత నభోభాగంబు వ్రీలంగని
మ్మన్న; లవంబేనియు జంకులేదవుర! శంభుండంచు దంభంబులే
పలుకన్ నోరెటువచ్చెరా చెనఁగ! నీ పారుష్యముల్ మానురా.

వీర:—మూర్ఖులారా! మీ రాతని మాహాత్మ్యమెఱుంగరు.

తే. సర్వలోకాధినాథుండు సర్వసాక్షి
యనుపమానమహానుహిమాతిశయుఁడు
రుద్రుఁడాతండు నిరతనిర్నిద్రతేజుఁ
డతనితోఁ బోరొనర్ప మీకలవియగునె?

కావున, మీ వేడబము లాతని చెంతఁబనికిరావు. మీయపరాధము లుపశమింప శరణు వేఁడుకొనుఁడు. దయార్ద్రహృదయుఁడగు నా మహానుభావుఁడు మిమ్మనుగ్రహించును. అతఁ డధిజ్యకార్ముకుండయ్యెనేని జగత్ప్రళయమగుట వింతకాదు. మీరంతయు నాతని కంటిమంటకు చూదిపింజెలకన్న నలంతులు. నా సామవచనంబులు మనంబుల నిడుకొని తొలఁగిపొండు.

తార:—(రోషముతో) ఇహీఁ! యవివేకీ! వ్యర్థప్రలాపములాడుచుంటివేమి? నీతులుగఱవ నరుదెంచితివి కాఁబోలు! కపాలహస్తునకు వేఁడుకొనుమని వదరుచుంటివి? చూదిపింజెలకన్న నలంతులమని ప్రేలుచుంటివి! ఛీ; యివి వట్టి దురాలాపములు; నోరుమూసికొని మీరు వెడలిపొండు.

[అప్పుడు కమలాక్షుఁడు ఖడ్గధారియై ప్రవేశించును.]

కమ:—(కోపముతో)

శా. పారావారములన్ గలంచితి, నభోభాగంబు శోధించితిన్,
నీరంధ్రాటవులందుఁ గ్రుమ్మరితి, క్షోణీచక్ర మీక్షించితిన్
క్రూరాత్మా! నినుఁ గాంచనైతి, నిదె మద్ఘోరాసిచే నేఁడు సం
హారంబుం బొనరింతు, డాఁగెద విఁకేలా రమ్ము వైకుంఠుఁడా!

(పరిక్రమించి యగ్రజులం జూచి) హా! మోసము మోసము.

విద్యు-తార:—(ఆశ్చర్యముతో) హా! విపరీతము విపరీతము.

కమ:—(విచారించి) ఔరా! యెంత యవివేకము!

తార:—హా! సోదరా! వైకుంఠుని వెదకఁబోయి యిక్కడికే చేరుకొంటివా? ఇట్టిసంఘటనము విపత్తుఁగూర్చునదియని మఱపుగొంటివా? ఎంత దీక్షవహించిన నెంత జాగరూకత మెలంగినఁ దుట్టతుద కిట్టి దుర్భరవిషాద మనుభవింపక తీఱనిదయ్యెనా?

కమ:—హా! దైవ దుర్విపాకము; దుర్వారవిప్లవ హేతువు. హా! మోసము మోసము.

విద్యు:—సోదరులారా! ధీరతవాటింపుఁడు. అనుల్లంఘనీయమగు వీరధర్మము-చరిత్రప్రసిద్ధమగు వీరధర్మము-కఠోరము కదా! సంగరోన్ముఖులుకండు. జయాపజయ విషయము లిట నవిచార్యములు. ఉత్తేజకరమగు వీరచారిత్రపద్ధతి కిది యనుకూలమగు పరమధర్మము; నిరవధికమై, నిరంతరము మనస్సును వేధించుచున్న సంకల్ప పరంపరలకిది పరమావధి.

తార:—నిజము; ఇదిమనకందఱకు సేవనీయమగు పవిత్రస్థానము,

తే. ఇది దురంత మనోవ్యథా విదళనంబు
విశ్రమస్థానమగు మహావీరుల కిది
ప్రకృతిపరిణతి కిది ముఖ్యపరికరంబు
ఘోరసంగ్రామరంగం బకుంఠితంబు.

కమ:—(కోపావేశముతో) కాదనువారెవరు? గరిష్ఠతఁ గూర్చు వీరధర్మ పరిపాటికియ్యది చివరమెట్టు; కావున, నేకాభిప్రాయ నిరూఢులమై మెలఁగవలెను.

తే. విజయమో, లేక ప్రతికూల విధివిధంబొ
జరుగనిండెద్దియైనను జంకువలదు
తండ్రిఋణమునుదీర్ప సద్ధర్మమగుటఁ
బోరుదముగాక సంగ్రామ భూమినిలిచి.

[తెరలోఁ గలకలానంతరము]

[అప్పుడు రథారూఢుఁడై ఈశ్వరుఁడు ప్రవేశించును.]

ఈశ్వ:—(కోపముతో) అరే! నక్తంచరాధములారా! మీరింకెందుఁబోయెదరు ?

శా. బాహాటోపము శౌర్యముం బలము శుంభత్ప్రౌఢియున్ సంగరో
త్సాహంబున్ జటులస్త్రయుంబుఁజెడి, చేతంగాక మీరెందుఁబో
నూహంజేసిన, దుర్నివారిత మదీయోద్వేల ఫాలాగ్ని దృ
క్ప్రాహాత్మ్యంబున నల్పకాలమున భస్మంబేనొనర్తుంజుఁడీ.

కుడిచి కూర్చుండఁజాలక కొఱవితోఁ దలగోఁకికొనుచుంటిరి. మీరు ప్రాణభీతివిడిచి, యసహ్యదురాచార దుష్ప్రశాచకరగ్రహణ మొనర్చి, లోకబాధాకరకృత్యము లెన్ని చేసితిరి? దండనార్హులు, మిమ్మిఁక విడువఁదలంపను.

విష్ణు:—ఓహో! ప్రవేశమునందే ప్రలాపములా? ప్రపంచ ధర్మనిర్ణాయక కర్తలుకదా తమరు! గురివిందగింజవలెఁ బ్రపంచమున మెఱయుచు, బంగారముతోఁ దులదూఁగుచుందురు!

1-2-3:—(నవ్వుదురు.)

తార:—ఓహో! యెంత మహానుభావుఁడవు! ఆఁడుదాని దేహము సర్ధవంతముగఁ జేసికొని రణోత్సాహముచే సంపూర్ణశక్తిమంతునివలె మమ్ము శాసించుచున్నావు. ఇంక విపరీత ప్రసంగ మొనర్పక సామర్థ్యముఁ దేటపఱుపుము.

కమ:—ఇది రణక్షోణి; వాగాడంబరమునకుఁ దావు లేదు. వాకచక్య నైపుణ్యములన్నియు నస్త్రశస్త్రవిన్యాసములవలననేఁ దేఁటతెల్లమొనర్పుము.

ఈశ్వ:—(సక్రోధము) మూర్ఖులారా! నా ప్రభావ

మెఱుంగక తుచ్ఛవాక్యము లాడుచున్నారు! మదీయ ప్రతాపానల మునకు దగ్ధులైన యంధకాసురాదుల స్మరించుకొని శరణుపొందుఁడు, ప్రాణములు దక్కించుకొనుఁడు; కాదేనిఁ దుత్రిటికాలమైన నాయెదుట నిలువఁజాలరు. లోకక్షేమాచరణమునకై మీ విజిగీష నంతయు నిర్దగ్ధమొనర్తును.

విద్యు:—ఓయీ! లోకక్షేమములారయు మహానుభావుఁడవా నీవు? సరియే, నీయాత్మస్తుతిపరాయణత్వము సర్వశ్లాఘ్యమైనదిలే. ఇంక నిన్ను క్షమింపుమని ప్రాలుమాలి యెవ్వరును బతిమాలరు. రణోన్ముఖుఁడవగు నీకింత యార్భటమెందులకు? ఎవ్వరినో మేము స్మరించుకొనుటయుఁట; శరణుపొందుటయుఁట; జల్ప ప్రసంగము చాలించి కార్యము నుపక్రమింపుము.

తార:—అడుగిడిన దాదిగఁ బ్రసంగించినదంతయు విచిత్రమే; దొంగపోటుగా జరిపిన ప్రాఁతవైఖరు లెంతకాలమునకైనను విడువవు కాఁబోలు! ఓయీ! కొండపైఁ గాపురముండి, శ్మశానమునఁబవ్వళించి, యోడలెల్ల బూడిదఁబూసికొని, బిచ్చమెత్తుకొని విసుగుఁజెంది, పాపము! శ్రమదీర్చుకొనవచ్చితివికదా!

1-2-3:—ఆహాహాఁ! (నవ్వుదురు)

కను:—అటులైన విశ్రమింపుము; హాయిగా విశ్రమింపుము. నీకిదియే బ్రహ్మానందము;

వీర:—(ఈశ్వరునితో) దేవా! కర్ణకఠోరముగ నొనర్చెడు యిట్టిదూషణమున కింక నుపేక్షింతువా? ప్రళయవిఘ్నాతపాతంబు ననుకరించు నొక్క దివ్యాస్త్రమున వీరినిప్పుడే తెగటార్పుము.

శా. సంకోచింపఁగనేల దీనికి భుజాసారంబు బీరంబునుం
గుంకంజేసి నిశాతసాయకమునన్ గూల్పంగదే దైత్యులన్
గింకంబూనఁగరాదె యుద్ధత రణక్రీడాప్రసక్తుండవై
యింకం బ్రేముడి యేలచూపెదవు మేలే, చేటువాటిల్లదే!

భృంగి:—దేవా! విముక్త నిర్మోక భయానకంబులగు మహోరగంబుల వలె క్రోధోన్మత్తులైన యీ దానవాధములఁ

బురత్రియంబుతోఁబాటు రూపుమాపుము. అదిగో! దేవత లందఱుఁ బుష్పమాలికలుగొని నిన్ను సేవింపనున్నారు.

ఈశ్వ:—అటులేయగుఁగాక! అభిజిన్ముహూర్తముకూడ సమీపించినది. (శరసంధానమొనర్చును.)

[తెరలో]

కమలాక్షా! ఇదే వైకుంఠుఁడు నాచేఁ జిక్కినాఁడు. రమ్మురమ్ము.

కమ:—(ఆకర్ణించి శరసంధానమొనర్చి)ఇదేవచ్చుచున్నాను. ఆతనిఁబోనీయకుము.

వీర:—దేవా! వీఁడు తప్పించుకొన నెంచుచున్నాఁడు. జాగరూకుఁడు. కాలమాసన్నమైనవారియందుఁ గల లక్షణము లన్నియు వీరియందుఁ బ్రంజీభవించినవి.

ఈశ్వ:—దురాత్ములారా! మీరింక బ్రదుకఁజాలరు. రగులుకొనుచున్న మదీయ ఫాలనేత్రాగ్ని జ్వాలలకు మున్ముందుగా మీపురత్రయము నాహుతి గావించుచున్నాఁడను; చూడుఁడు.

[నేత్రాగ్నివలనఁ బురంబులు దహింపఁబడుట కానవచ్చును.]

1-2-3:—(విస్మయముగాఁ జూచుచుందురు.)

ఈశ్వ:— ఈ ప్రళయమునుండి మీరింకఁదప్పించుకొన లేరు. (ధనువాస్ఫాలించి)

తే. చండభుజబలగర్వ నిస్తంద్రులగుచుఁ
గన్నుఁగానక మెలఁగు దుష్కర్మరతుల
మిము, మహోదగ్రదోర్లీల మెఱయ నాదు
ఘోరనారాచమున నిదే గూల్చువాఁడ.

[అని శరము విడువగనే అది యగ్నిచక్రమువలెఁ జుట్టుముట్టును.]

1-2-3:—[వెనుకకుమఱలి] హా! హతోఽస్మి!

[అప్పుడు ఇంద్రుఁడు, బృహస్పతి, నారదుఁడుమున్నగువారు ప్రవేశించి ఈశ్వరుని కంఠమున సుమమాలలు వేయుదురు.]

( అనుబంధము ౬. )

ఇంద్రు:—దేవా !

మ. దుడుకుంబోకలఁబోయినట్టి ఖలులన్ దున్మాడి లోకాళికిం
గడుభద్రంబొనగూర్చి కాచిన జగత్కల్యాణుఁడీవే కదా !
యదురాజాధ్వకిరీట ! నిన్ను మదిలో నూహించి సంప్రీతి నీ
యడుగుందామర లర్థిఁగొల్తుము మహాత్మా ! దీనసంగక్షకా !

బృహ:—దేవ దేవా !

తే. ఆర్తజనరక్షణంబె ముఖ్యంబు నీకు
భక్తసులభుండవీవు విశ్వమయుఁడీవు
ఫాలలోచన ! తావక ప్రథితశక్తి
ఘన మనీషులుఁబొగడ దుర్ఘటముకాదె !

నార:—దేవాదిదేవా !

మ. దివిజస్తోమనుతప్రభావము, మహాదేదీప్యమానంబు, సం
స్తవనీయాఖిల ధర్మసంచయము, విశ్వవ్యాపకం, బిందిరా
ధవ నీరేజభవాంశ భాసురము, శుద్ధజ్ఞానబోధంబు, నీ
శివతత్త్వంబు నుపాస్తిఁజేతు మది నిష్ఠైకదీక్షారతిన్.

భరతవాక్యము.

తే. జగములన్నియు సంప్రీతి నెగడుఁగాక !
దుష్ట సంతతి నాశమై తొలఁగుఁగాక !
సహన సంపత్ప్రభావ విస్తారమతుల
బుధులఁ గలకాల మీశుండు బ్రోచుఁగాక !

అందఱు:—తథాస్తు తథాస్తు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది పంచమాంకము.

సంపూర్ణము.